శ్రీః.

# రత్నప్రభ

మూడంకముల చరిత్రాత్మకనాటకము

ఏ యస్. పి. అయ్యర్, యమ్. ఏ., ఐ, సి. యస్., గారి

ఆంగ్లగ్రంథమునకు

శ్రీ సర్వా వేంకటశేషయ్యగారి అనువాదము.



చెన్నపురి:

రామస్వామిశాస్త్రులుఅండ్సన్స్ వారిచే

ప్రకటితము.

1938.

శ్రీః.

# రత్నప్రభ

మూడంకముల చరిత్రాత్మకనాటకము

ఏ యస్. పి. అయ్యర్, యమ్. ఏ., ఐ, సి. యస్., గారి

ఆంగ్లగ్రంథమునకు

శ్రీ సర్వా వేంకటశేషయ్యగారి అనువాదము.



వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1938.

# పీఠిక.

ఈ 'రత్నప్రభ' నాటకము, సుప్రసిద్ధన్యాయమూర్తులు, విఖ్యాతగ్రంథకర్తలు నగు శ్రీయుత వీ. యస్. పి. అయ్యరుగారాంగ్లమున రచించిన **'A Mother's Sacrifice'** అనురూపకమున కనువాదము. ఇందలి, కథావస్తువు చరిత్రాత్మకము, భాష పాత్రోచితము, ప్రధానాంగములు భక్తిత్యాగసమర్పణంబులు, గుణదోషంబులు రసజ్ఞలోకగ్రాహ్యంబులు.

మానవత్వమును సమర్థించు నుత్తమలక్షణములలో నగ్రస్థానము వహించునది భక్తి. అది పలువిధములు, దైవభక్తి, గురుభక్తి, పతిభక్తి, స్వామిభక్తి, దేశభక్తి, ధర్మభక్తి, ఇత్యాదులు. మోక్షసాధనమైనభక్తి యేరూపమున నున్నను సమాదరణీయమైనదే. కారణాంతరముల స్వధర్మవైముఖ్యము గలుగుచున్న నీకాలమున స్వామిభక్తిప్రేరితయై, తన యేకైకపుత్రుని బలియిచ్చిన ధీరురాలిచరిత్రము రూపకవస్తువుగా నుండదగినదనుటలో భేదాభిప్రాయ ముండజాలదు.

సాగరసంగమంబున నస్వాదుజలముతోడను, దుర్భరకఠోరఘోషతోడను బీభత్సముగనుండు నదీమతల్లి, తనజన్మస్థానమ్మున నమృతోపమానసలిలంబుతోడను, మనోహరలలిత

మృదుమధురనినాదంబులతోడను సొంపు పెంపారుచుండును. అటులనే భక్తియు నభివృద్ధి పొందినకొలది నన్యమతవిద్వేష చిత్తచాంచల్యాది వికృతరూపంబులంది దుస్సహమై యుండును. అట్లని భక్తి పరిత్యాజ్యము గాదు. నిలువయుంచిన విషమగు నను నెపంబున నన్నంబు ద్వేషించు బుద్ధిమంతు లుండరుగదా !

కథానాయిక భక్తియుదయావస్థయం దున్నది. ఆనిర్మల నిరాడంబర సాధారణజీవి తన సర్వస్వము స్వామిహితార్థ మర్పించినది, అంతరాయపారావారంబు దృఢభక్తిపోతంబుచే దరించి విజయకూలంబు చేరినది. నాల్గువందలసంవత్సరములు గడచినను, తత్త్యాగమహిమాతిశయము విస్మయాస్పదమై విస్పష్టంబుగ బొడగట్టుచునే యున్నది. 'త్యాగేనైకే అమృతత్వ మానశుః' అని ఆమ్నాయప్రమాణము గలదు గదా ! వర్తమానలోకపరిస్థితు లల్లకల్లోలముగా నున్నవి కాని భక్తశిఖామణులహృదయంబులు ప్రశాంతములై నిష్కళంకములై సుదృఢంబులై స్వధర్మనిర్వహణోత్సుకంబులై యున్నవి.

స్వధర్మే నిధనం శ్రేయః.

స. వే. శే.

# నాటకమునవచ్చు పాత్రలు.

పురుషులు:—

**విక్రమజిత్తు**—చిత్తూరు రాణావయస్సు 21 సంవత్సరములు.

**వనవీరుడు**—చిత్తూరురాణా - రాజనీతివేత్త - 50 సంవత్సరములు.

**ధనమల్లు**—వనవీరుని మంత్రి.

కరంచందు—అజమీరుప్రభువు. చిత్తూరు రాజసామంతుడు. వయస్సు 60 సంవత్సరములు మహాయోధుడు. పెద్ద గడ్డము గలదు.

కాంజీ—సామంతుడు వ్యవహారజ్ఞుడు. 40 సంవత్సరములు.

**మాలోజీ**—థానా సంస్థానాధిపతి 35 సంవత్సరములు. తొందరపాటు స్వభావము గలవాడు.

సోలంకీ—మహాలీ సంస్థానాధిపతి.

జగ్గు—రాజుగారి వంటవాడు.

ఆశాసా—జైనుమతస్థుడు కుంభాల్మరు దుర్గాధిపతి.

**మహావీరుడు**, **సుఖవీరుడు** } మల్లులు.

**ఉదయసింహుడు**—చిత్తూరు యువరాజు, **చందరుడు**—పన్నా కొడుకు } వయస్సు 6 సంవత్సరములు. రూపురేఖావిలాసములందు, ఒడ్డుపొడుగులందు తుల్యులు.

స్త్రీలు:—

**పన్నా**—ఉదయసింహుని దాది వయస్సు 26 సంవత్సరములు.

**యశోద**—ఆశాసా తల్లి.

# రత్నప్రభ

## మొదటి అంకము

### మొదటి రంగము.

---

[స్థలము—చిత్తూరు రాజసభామందిరము. కాలము—పగలు 11-గంటలు. రాణా విక్రమజిత్తు సింహాసన మధిష్ఠించియుండును. అతని కిరు వైపుల సేవకులు నిలుచుండి వింజామరలు వీచుచుందురు. ఆర్గురు సైనికులు విచ్చుకత్తులు పూని సమీపమున నిలబడియుందురు. విక్రమజిత్తున కెడమ వైపున సామంతులు నిజవైభవానుసారముగ నాసనము లాక్రమించి యుందురు. సింహాసనమున కెదురుగా మహావీరుడు సుఖవీరుడు మల్లయుద్ధము చేయుచుందురు. వారిచుట్టు పెక్కుమంది సైనికు లాయుధపాణులై కావలి కాయుచుందురు. విక్రమజిత్తు, మల్లయుద్ధము దదేకదృష్టితో జూచుచుండును. సామంతరాజుల కా మల్లయుద్ధ మంత ఆనందజనకము గాకుండును. అజమీరు ప్రభువు కరంచందు తన కుడిప్రక్క గూర్చుండిన మాలోజీతోడను, ఎడమవైపున గూర్చుండిన కాంజీతోడను మెల్లగ మాటలాడుచుండును. మహారాణా కుడివైపున నుదయసింహునకు సింహాసన మమర్పబడియుండును. ఉదయసింహుడు మాత్రము సభలో నుండడు.]

**కరంచందు**—ఔను. వనవీరుడు చెప్పినసంగతి యుక్తముగనే యున్నది. ఈ అంతులేని దౌర్జన్యము దుర్భరముగ నున్నది. మహారాణాకు బూర్వానుభవమువలన నించుకేనియు జ్ఞానము గలుగలేదు. ఆయన మల్లయుద్ధములతోడను, వినోదప్రదర్శనములతోడను కాలము వ్యర్థము చేయుచున్నాడు. నీచులకు, సైనికులకు నిరంతరము కనకాభిషేకము గావించుచున్నాడు.

**కాంజీ**—నీచులను గౌరవించుటయే కాక, ఉత్తమరాజపుత్రవంశజు లగుసామంతులను దరిచేరనీయక చిన్నచూపు చూచుచున్నాడు.

**మాలోజీ.**—ఈదురాగతము దినదినము పెరిగిపోవుచున్నది. నానాటికి ముసల్మానులు బలవంతులై తమరాజ్యమును వృద్ధిపొందించుకొనుచున్నారు. సక్రమపరిపాలనము లేకపోవుటచే మేవాడురాజ్యము క్రమక్రమముగా క్షీణించి, ఖండఖండములై పోవుచున్నది. ప్రజలకు రాజుపై నసహ్యము గలుగుచున్నది. ఇంకి సామంతప్రభువులమాట అడుగవలయునా?

**కరంచందు**—మహారాణా అంటే సామంతులకు నాయకుడు, ప్రజలకు సంరక్షకుడు, కాని, కొల్పంటులకు నాయకుడు, మల్లులకు రక్షకుడు గాడు. అతని కీవిషయమే తెలిసినటులు కనుపడుట లేదు.

**కాంజీ**—నిజమే. మహారాణా కీసంగతి దెలియజెప్పవలసినదే. మా అందఱిలోను నీవు పెద్దవాడవు, సంగమహారాణా

కత్యంతాప్తుడవు, ఆప్తుడవు మాత్రమే కాదు, కష్టకాలమున నాతనికి నిలువ నీడ యొసంగి, అండయై నిలిచి వృద్ధిలోనికి దెచ్చిన పరమోపకారివి. కాన సంగరాణాత్మజుని మందలించుటకు నీవే తగినవాడవు. నీవంటివాడు చెప్పిన హితము నన్యథా భావించుటగాని, రాజద్రోహముగా బరిగణించుటగాని తటస్థింపదు.

**మాలోజీ**—వనవీరుడన్నట్లు మనము రాజపుత్రులవలె నాత్మగౌరవమయిన గాపాడుకొనవలయును, లేదా రాజపుత్రుల మనుమాట మఱచినయైన బోవలయును.

**కాంజీ**—రాణాగారిమంత్రియే అటులు తలంచుచో, తగిన చర్యదీసికొనుటకు సమయ మాసన్నమైనదన్నమాటే. కరంచందుమహాశయా! మా అందఱిపక్షమున నీవు నాయకుడవై రాణాకు నిండుసభలో మన అసమ్మతి దెలిబుచ్చుము. దానివలన బ్రయోజనము గలిగిన గలుగును.

**కరంచందు**—ఏకాంతముగ నున్నప్పు డనేకపర్యాయములు రాణాను గట్టిగా మందలించితిని. దానిచే నన్నాతడు విషమువలె బరిత్యజించుచున్నాడు. అతనికి మనము చెప్పు హితము రుచించునటు లగుపడుట లేదు. అయినప్పటికి నిండఱి అసమ్మతి నెఱుగుటవలన లాభము గలుగునేమో ? మీరందఱు సిద్ధపడినచో నా కభ్యంతరము లేదు.

**కాంజీ**—నిరభ్యంతరముగా మేమందఱము నీకు బాసటనై నిలబడెదము.

**కరంచందు**—అట్లయినచో నిప్పుడే రాణా కీవిషయము దెలియబఱచెదను. (అని విక్రమజిత్తున కభిముఖుడై

చును. ఎట్టకేలకు మహావీరుడు సుఖవీరుని బడవైచును. మహారాణా, సిపాయీలు, ప్రజలు గట్టిగా జప్పట్లు చఱుచుచుందురు.)

**విక్రమజిత్తు**—సెబాసు! మహావీరా! సెబాసు. ఇదిగో ఈ పారితోషికము గ్రహింపుము. (సువర్ణకంకణద్వయము నందింపబోవును. మహావీరు డద్దాని గ్రహింపబోయి తనకును రాణాకును మధ్యగవచ్చిన కరంచందును జూచి వెనుకకు వగ్గును.)

**కరంచందు**—(విక్రమజిత్తున కెదురుగా నిలిచి) స్వామీ!

**విక్రమజిత్తు**—(క్రోధావేశముతో) ఓ పిశాచమా! నీ కేమి కావలయును. మేము పారితోషికదానము చేయుచుండుట నీకగుపడుట లేదా? ఓ వృద్ధజంబుకమా! మా కడ్డు పడుట నీకిదియే సమయమా?

**కరంచందు**—(కొంచెము జంకి) రాజా! నేను పిశాచమును గాను. రాజోత్తముడయిన నీతండ్రి సంగమహారాణా నాయుపదేశ మెన్నడును బెడచెవిని బెట్టలేదు. అదియునుగాక నేను జెప్పబోవునది ఈ సకల సామంతమండలి పక్షమున మీరా కష్టముల పాలగుచున్న ప్రజలమొర నాలించుట లేదు, దేశమా సక్రమప్రభుత్వాభావముచే చిందరవందరగాయి పోవుచున్నది. బప్పారావులవంశములో జన్మించినవీరులకు, ఈజెట్టీలు, ఈపదాతులు మిత్రులుగా నుండదగినవారు గారు. అదియుగాక మేవారు రాజ్య గౌరవప్రతిష్ఠల నిలుపబెట్టుట రాజపుత్రేతరులకు సాధ్య

మయినకార్యము గాదు. ఆభిజాత్యసంపన్నుల మయిన మేము నీకు మిత్రులము, హితులము. మేము మి మ్మాశ్రయించుచుంటిమి. మీరు మమ్ము జేరదీయవలయును. మీరు, ఈ సామంతమండలి కధినాయకులు, ప్రజలకు సంరక్షకులు ననుమాట మఱువ గూడదు. మీకు ఈ జెట్టీలు, ఈ సిపాయీలు మాత్రమే గౌరవార్హులు గారు. సర్వసమర్థుడు, వీరాధివీరుడు రాజకులాలంకారుడు అగు మీతండ్రి మాయుపదేశ మాలించి, తదనుగుణముగా ప్రవర్తించి విజయలక్ష్మీకరగ్రహణము గావింప గలిగినాడు.

విక్రమజిత్తు—అయితే మీయుపదేశమే అతని పరాజయము నకు గూడ గారణమయినది కాబోలు. మీ యుపదేశాను సారమే అతనికి విషము బెట్టుట గూడ దటస్థించినదా ఏమి?

కరంచందు—హర! హర! ఎంతమాట! ఎంతమాట! ఓ ప్రభూ! ఈ అగౌరవము మాత్రము సహింపలేను, సహింపలేను నీవు కళ్లు తెఱువకపూర్వమే, నీతండ్రి ననేక కష్టములనుండి తప్పించి ప్రాణాధికంబుగ గాపాడిన నేను సంగమహారాణాను జంపితి నను నేర మారోపించు చున్నావుగా! ఏంత సాహసము! ఎంత సాహసము!

విక్రమజిత్తు—(రోషముతో) ఏమీం! సహింపలేవా? సహింప లేనని నీరాజుతో జెప్ప సాహసించుచున్నావా? సామంతులమనుకొను మీరు నాకు సేవకులు గాని నాతో సమానులు గారనువిషయము గ్రహింపుడు. ఈమల్లులను సిపాయీలను వొలగింపుమనియా మీ రాసించునది. మీకన్న

వా రనేకవిధముల ప్రయోజకులు, విశ్వాసపాత్రులు, ఉప కారులు. దేశకాలపరిస్థితులు గుర్తింపక, అనవసరముగ మీరు గావించు దురుపదేశమువలన మాకు దలనొప్పి వచ్చుచున్నది. మహావీరా! రమ్ము. ఈమూర్ఖు నావలకు నెట్టి వేయుము. (మహావీరుడు ముందుకు వచ్చి కరంచందు భీషణాకారము చూచి, ఆగిపోయి భయముతో వణకు చుండును.)

**కరంచందు**—ఈ నీచసేవకుడు నన్నడ్డగించువాడా? నన్నడ్డగింపజాలినవాని నేటివఱుక గాంచలేదు.

**విక్రమజిత్తు**—(క్రోధతామ్రాక్షుడై) ఇదిగో వాని నిప్పుడే కాంచెదవు. (అని సింహాసనము దిగి కరంచందు రెండు చెంపలు వాయించును. కరంచందు నిర్విణ్ణుడై మాట లాడక నిలిచియుండును. సభలోనున్న సామంతులందఱు కోపముతో లేచి నిలుతురు.)

**విక్రమజిత్తు**—ఇంక మీ ప్రలాపములు మేము వినువలె లేదు. మీలో నెవరైన నోరు మెదపిన దగిన శాస్తి యగును. (మహావీరు నుద్దేశించి) ఓరీ! దౌర్భాగ్యుడా! నాయాజ్ఞ నిర్వహింపకపోతివి సువర్ణకంకణములకు బదులు నీకు నిగళయుగళము ప్రాప్తించును లే. ఓ సిపాయీలారా! ఈవిధవను, సంకెళ్లు వైచి చీకటి కొట్టులో బంధింపుడు. (సిపాయీలు మహావీరుని గొనిపోవుదురు. విక్రమజిత్తు అంతఃపురములోనికి బోవును. సేవకులు సైనికులు వాని

వెంబడింతురు. సామంతులందఱు కరంచందు చెంతకు పోవుదురు.)

**కాంజీ**—నిండుసభలో నింతటి ఘోరావమానమా? వృద్ధుడనిగాని, ఉపకారి అనిగాని విచారింపలేదే! కరంచందు మహాశయా! ఈ నీపరాభవము నీ సామంతసోదరులందఱు దమదిగా భావించి విచారించుచున్నారు. ఇట్టిదురాగతము మఱల జరుగకుండునటులు మనము దగుచర్య దీసికొనవలయునుసుమా!

**మాలోజీ**—కాంజీ! మనమందఱము. మీ మందిరమునకరిగి అచట నీసంగతి విమర్శించుట యుక్తమేమో!

**కాంజీ**—ఔను, అదియే మంచిది. రండు పోదము. (సామంతులందఱు కాంజీ కరంచందుల ననుసరించి పోవుదురు.)

**సుఖవీరుడు**—(లేచి) అదృష్టవశమున నాకీదినము గెలుపు గలుగలేదు. ఒక్కక్షణమునకు బూర్వము, ఓడిపోయినందుల కెంతో విచారపడితిని, కాని ఓడిపోవుటయే నేడు క్షేమకరమయినది. గెలిచినచో నాకు గారాగారము లభించియుండెడిది. పాపము మహావీరుడు బ్రతికి బయటబడునా? ప్రమాదము గలుగకపూర్వమే నే నిటనుండి తప్పించుకొనుట మంచిది. (అని నిష్క్రమించును. అజితుడు హిమ్మతుడు అను మిత్రులిర్వురు దప్ప దక్కినవారందఱు వెడలిపోవుదురు.)

**అజితుడు**—(మెల్లగా) అంత అవమానము జరిగినపిదప కరంచందు మాటలాడకుండుట చాల చోద్యముగనే ఉన్నది.

ఆయన ఏదైనా సాహసము చేయుననుకొంటిని. ముప్పది ఏండ్లనుండి రాజసభకు వచ్చుచుంటిమిగాని ఎన్నడయిన ఇట్టిదురాగతము సంభవించినదా ?

**హిమ్మతుడు**—(మెల్లగా) అనుకోనంతపని జరిగినందున ఆయన మాఱుమాటాడలేకపోయినాడు. కాని ఈ పరాభవము చేత. ఈరాణామీద అతనికున్న అభిమానము పూర్తిగా నశించిపోయినది.

**అజితుడు**—ఔను, ఆసంగతి గమనించితిని. సామంతులవైఖరి చూడగా అనుమానమే గలిగినది. వారంతా కలిసి ఏమైనా ద్రోహం చేసెదరా ఏమి ?

**హిమ్మతుడు**—నిశ్చయముగా వారు దగినశాస్తి చేయుదురు. పడగవిప్పినత్రాచు కఱువక మానదు, పగబూనిన రాజపుత్రుడు కొంపదీయక మానడు.

**అజితుడు**—అయితే ముందు ఏం జరుగుతుంది ?

**హిమ్మతుడు**—ఇంక పదిరోజులలో విక్రమజిత్తుపరిపాలన సమాప్తము గాగలదని నమ్ము.

**అజితుడు**—అంత శీఘ్రముగానే !

**హిమ్మతుడు**—అంతకన్న త్వరలోనే కావచ్చును. విక్రమజిత్తునకు సాయముచేయువారెవరును లేరు. అతనియెడ లోకుల కసహ్యము గలిగినది. ఈదుస్త్రీలు, ఈ వినోదాలు, ఈసామంతుల ప్రతీకారాలు, ఇంక చాలును. ఈసిపాయీలు, తమకు మేత వేయలేదనేకారణమున, రత్నసింహునియిల్లు తగులబెట్టి నెలదినాలైన గాలేదు. యదువు

అనే జెట్టీ రామసింహుని కుమార్తెను క్రిందటివారమే లేవదీసికొని పోయినాడు. రామసింహునిబందుగులు రాణాకు వెలచి ఆదుర్మార్గు నేమియు జేయలేకపోయిరి. విక్రమజిత్తుతో మొఱపెట్టగా నాతడు వారిని పరిహసించి పంపినాడట. యదువును మందలింపనైన మందలింపలేదట. బాబో! ఈసంవత్సరము ఎన్నికష్టాలు వచ్చినవి. దిన మొక యుగముగ గడచినది. కరంచందు చెప్పినటులు, రాజు ప్రజలను కన్నబిడ్డలవలె గాపాడవలె గాని త్రాచుపాము వలె మ్రింగకూడదు.

**అజితుడు**—నీవన్నట్లే జరిగితే రాజ్యాని కెవరు వత్తురు?

**హిమ్మతుడు**—అది భగవంతునకు దెలియవలసినదే. కాని ఇంతకన్న నీచుడు దాపరింపడు.

**అజితుడు**—నీవన్నది నిజమే. చూచితివా కరంచందును నెట్టివేయ సంశయించిన మహావీరుని కేమిగతి పట్టినదో?

**హిమ్మతుడు**—ఈవిషయములో నన్యాయమే జరిగినా, వాని గుఱించి జాలిపడరాదు. ఆదురాత్మున కీశిక్ష మున్నెన్నడో జరిగి ఉండవలసినది.

**అజితుడు**—నిజమే గాని విక్రమజిత్తు పరివారమందఱు ఇటువంటివారే కదా!

**హిమ్మతుడు**—అందుకోసమే. అతడు సమూలముగా నాశనమై పోగలడు

**అజితుడు**—అయితే ఇంతకంటె మంచిరాజు వచ్చునని నీకు నమ్మక మున్నదా?

**హిమ్మతుడు**—రాజు నెన్నుకొనుటలో మనకు సంబంధము లేనప్పుడు ఏమి నమ్మకము చెప్పగలము. కానీ ఇంతకన్న నికృష్టుడు రాడేమో! సరే మంచిది నే నింక వెడలి మా ఊరివారి కీశుభవర్తమానము వెంటనే చెప్పకపోయి నచో బాగా ఉండదు.

**అజితుడు**—మంచిదే నేను గూడ తొందరగా వెడలెదను.

(ఇరువురు చెరియొకదిక్కుగా నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

# మొదటి అంకము

## రెండవ రంగము.

[స్థలము—చిత్తూరులో కాంజీ మందిరము. కాలము—ఆదినమే మధ్యాహ్నము 12-గంటలు. కాంజీ, కరంచందు, కొఠారీ చౌహాణుడు, సోలంకి, తదితర సామంతులు సమావేశమయి విక్రమజిత్తువిషయమై తీసికొన దగిన చర్యనుగూర్చి సమాలోచనము చేయుచుందురు.]

కాంజీ—సోదరులారా! అప్పుడే పువ్వు పుట్టి పరిమళము వెదజల్లినది కాల మతిక్రమింపకుండ దగిన ప్రయత్నము చేయకున్నచో, మనము పండును గూడ రుచిచూడవలసి వచ్చును.

కరంచందు—ఈనా ప్రయత్నమునకు మీరందఱు మనస్ఫూర్తిగా జేయూత నిచ్చిన, నాపుష్పముయొక్క యథార్థమయిన పరిమళము బయటపడగలదు.

కాంజీ—ఆ ప్రయత్న మెట్టిదో తెలుపుము.

కరంచందు—మన మందఱము వనవీరునివద్ద కేగి విక్రమజిత్తు దొలగించి, అతనిస్థానమున నన్ను మహారాణాగా నెన్నుకొందుమని చెప్పుదము. (సభయంతయు నిశ్శబ్దముగా నుండును.) ఏమీ మీరెల్లరు మౌనము వహించితి రేల? ఈదుస్సహములైన అగౌరవములు, ఈ నీచాతినీచమయిన

దుస్థితి తలవంచుకొని భరించుటయే మీకు సమ్మతముగ నున్నదా?

**కొఠారి చౌహాణుడు**—సహింపలేకున్నమాట నిజమే, కాని, నీవు తలపెట్టినవి మాత్రము చాల తీవ్రముగా నున్నది.

**దేవలుడు**—నాకు గూడ నటులే తోచుచున్నది.

కరంచందు—సోదరులారా! ఇప్పుడు ఇనుక మనము సరియైన ప్రయత్నము చేయకపోయినచో, విక్రమజిత్తు మనకు దగిన శాస్తి చేయగలడు. దేశములోనున్న సిపాయీల సంతతిని బిలిపించవలసినదని విక్రమజిత్తు సేనానీకుని కాజ్ఞాపించినాడట. వారు వచ్చినచో మనకెట్టి యిక్కట్లు మూడునో, ఎంత ఎంత ఘోరపరాభవములు సమకూరునో, ఎట్టి దుర్దశ పట్టునో ఊహించుట కష్టముగాదు. ఈ మీ ప్రస్తుతస్థితి దృప్తికరముగా నున్నచో, నేను జెప్పవలసినదేదియు లేదు. నేను మాత్ర మీ రాజస్థానమును వెంటనే విడిచి పోయి, ఏ రాజోత్తముని కొలువులోనో చేరి రాజపుత్రోచితమయిన గౌరవముతో గాలము గడిపికొందును.

**మాలోజీ**—సోదరులారా! కరంచందు చెప్పినది యుక్తముగనే కనుపట్టుచున్నది. విక్రమజిత్తు మనలనందఱను నిర్మూలము గావించెదనని బెదరించి యున్నాడు. దర్శనమునకు వచ్చిన కొఠారి చౌహాణుని, మల్లులతో సల్లాపములాడుచు, మూడుగంటలు పడవైచి యుంచినాడు. కరంచందంతవానిని తుచ్ఛుడైన ఒకానొక జెట్టీచేత నెట్టివేయింప దలపెట్టినాడు. తనతండ్రిని సర్వవిధముల గనిపెట్టిన రాజ

పుత్రసామంతుని నిండుకొలువులో చెంపలు వాయించినాడు. ఔరా! ఎంత దురాగతము, ఎంత దురాగతము.

సోలంకి—అంతేకాకుండా, అశ్వికులయుగము గడిచిపోయినదనియు, సిపాయీలయుగము ప్రారంభమయినదనియు నతడు బహిరంగముగ బ్రకటించుచున్నాడు. యుద్ధములో గుఱ్ఱములతో బనిదీరిపోయినచో రాజపుత్రవీరులదశ తొలగిపోయిన దన్నమాటే. రణరంగమున బదాతులే నాయకత్వము వహించిన జటులముందర రాజపుత్రులు చిల్లిగవ్వకైన గొఅగారు. డబ్బుకు గడ్డితినే సిపాయీలు ప్రాణములు తృణప్రాయముగా భావించి రణరంగమున విజృంభించి శత్రువులను మార్కొనలేరు. వారికి దేశము, దేశగౌరవము, ఏమైపోయినను బాధలేదు. లాయిచా యుద్ధమున ముసల్మానులదాడి కాగలేక పలాయనమంత్రము పఠించినది ఆసిపాయిలే. గోగ్రహణకాలములో మనల నెదుర్కొనబంపిన సిపాయీ లెట్టివిక్రమము చూపినది మనకు దెలియనివిషయము గాదు. కాని, విక్రమజిత్తు ఈ విషయములు గమనించినటులే కన్పట్టదు. ఇప్పటికిని మన రాజపుత్రాశ్వికులకన్న, సిపాయీలు, మల్లులు, ద న్నుద్ధరింప గలరని భ్రమపడుచున్నాడు.

కరంచంద—చిత్తూరు ముట్టడినాటి విషాదవృత్తాంతములైన విక్రమజిత్తు స్మరించుచున్నటులు దోచదు. ఆ కష్టకాలమున దేశమునికి బట్టము గట్టవలసినచ్చినది జవాహిరీబాయి రణరంగమున వీరరసాధిదేవతవలె బోరాడి దేశక్షేమార్థము ప్రాణము లర్పించినది. పదాతులు ఎవరితోన

వారు మూచుకొనుటచే విక్రమజిత్తు నిస్సహాయుడై చిత్తూరు వైపైన జూడలేకపోయినాడు. గత్యంతరము లేక, కర్ణావతి, తన్ను దనరాజ్యమును గాపాడుమని మతాంతరుడయిన హుమాయూను కాళ్లు పట్టుకొనవలసి వచ్చినది. ఆ హుమాయూను గూడ బహదూరుషా తనకు గర్భశత్రువైనను, కాఫరులను నిర్మూలము చేయుచున్న నాటి మహమ్మదీయున కడ్డుపడుట ధర్మము గాదని యెంచి చిత్తూరు నేలమట్ట మగునంతవఱకు నుపేక్షించినాడు. మున్నిట్టి పరిస్థితులలోనే, తైమూరు, దయూజిదుచర్యల నామోదించి యూరకొన్నాడు—అట మహమ్మదీయులలో నున్న ఐకమత్య మిట్టిది.—ఇట విక్రమజిత్తు తన యవ్యక్తతచే రాజపుత్రవీరుల అభిమానము పోగొట్టుకొనుచున్నాడు—విజయము కలుగుననే ఆశ పూర్తిగా నొలగి పోయిన తరువాత, కర్ణావతి, పదమూరువేల రాజపుత్ర సాధ్వులు దన్ననుసరింప, రాజస్థానగౌరవము నిలువబెట్ట, వహ్నిదేవునకు ఆహుతి యైనది. అప్పుడు దేవలుని నాయకత్వమున ముప్పదిరెండువేల రాజపుత్రవీరులు యుద్ధరంగమున నురికి, శత్రువులకు దమ ప్రతాపము చవిచూపి, వీర స్వర్గ మలంకరించిరి. నాటి రాజపుత్రసైన్యమున ముందున కైన నొక్కసిపాయి యేనియు గానరాడయ్యె. ఎనుబది వేల రాజపుత్రాశ్వికులకు నాయకుడైన సంగమహారాణా యొక్క ఈ అనామకపుత్రుడు నీచపదాతివర్గాధిపత్యము వహింప నువ్విళ్లూరుచున్నాడు. ఇప్పుడు తన అధీనములో

నున్న ఏడులేల పదాతిసైన్యముతో మనల నణచివైచి కారాగారమున బంధింప సాహసించుచున్నాడు.

**మాలోజీ**—పాప మతడు వట్టి పిచ్చివాడు. పిచ్చివాడు రాజ్యార్హుడు గాడు. దుర్బలుడు, నపుంసకుడు, అంధుడు, బధిరుడు, మూగవాడు, పిచ్చివాడు, వికలాంగుడు, రాజ్యాధిపత్యమునకు దగరని మనువు శాసించియున్నాడు. తన మూర్ఖత్వమును పిచ్చితనమును, లోకానికి విశదపఱచిన విక్రమజిత్తును రాజ్యభ్రష్టుని గావింపదగునని ప్రతిపాదించిన కరంచందుతో నే నేకీభవించుచున్నాను. (చౌహాణుడు దప్ప దక్కినవారందఱు నంగీకారము వెల్లడింతురు.)

**కొఠారి చౌహాణుడు**—నీవాదాన్ని అంగీకరించినా, విక్రమజిత్తు సింహాసనభ్రష్టుని గావించుట మాత్రమే సమంజసమని తోచుచున్నది. దాని కిందున్నవా రెవరు సభ్యులంతరము చెప్పుటలేదు. కాని మనము ఉదయసింహుని రాజు జేయ వలసియున్నది. చిన్నవా డయినంతమాత్రమున నాతడు రాజ్యమున కనర్హుడు గాడు. వనవీరుడు విశ్వాసపాత్రుడు, యోగ్యుడు, మన కత్యంతాప్తుడు, ప్రస్తుతము కోశాధ్యక్షుడు, రాజనీతి, ఆర్థికశాస్త్రము బాగుగ దెలిసినవాడు, ప్రజల గౌరవాభిమానములు జూరగొనినవాడు. కావున నాతనిని రాజప్రతినిధి గావింతము. ఆతడు దానికి దప్పక నంగీకరించును.

**కరంచందు**—అది లాభించదు. వనవీరుడు రాజప్రతినిధిగా నుండ నంగీకరింపడు. అతడు రాజగుటకు గూడ నంగీక

రించునో, అంగీకరింపడో. రాజప్రతినిధిగా నున్న వానికి, క్రొత్తరాజు పరిపాలనకు వచ్చినతరువాత దప్పక దుర్మరణము సిద్ధించును. విశేషించి, తనయన్నకు అపకారము చేసిన వనవీరుని ఉదయసింహుడు తుదముట్టింపక మానడు. అట్టి అపాయకరమయిన ప్రతినిధిత్వము వనవీరు డంగీకరింపడు. మంత్రిగనుండుట వేరు, రాజప్రతినిధిగ నుండుట వేరు. రెంటికిని బోలికయే లేదు.

**కొఠారి చౌహాణుడు**—అట్లైనచో వనవీరుని వదలుకొనవలయును. ఉదయసింహుని రాజు గావించి, నీవుగాని, కాంజీగాని రాజప్రతినిధిగ నుండదగును.

**కరంచందు**—సమయము చిక్కిన రాజస్థానమును గబళింప మహమ్మదీయులు సర్వసిద్ధముగ నున్నారు. అట్టి ఈకష్టకాలములో ముక్కుపచ్చలారని పసిపాపని రాజును గావించుట కన్న దెలివితక్కువ వేరుండదు. 'అర్భకులు, అబలలు పాలించేరాజ్యము కోలుకో'దని చందుమహాకవి వచించిన దానిలో నసత్య మించుకేనియు లేదు. కర్ణావతి పాలించిన నాలుగురోజులలో నెట్టితలవంపులు గలిగినవో ఎఱుగవా? ముష్కరతురుష్కుడయిన హుమాయూనుని బాబూ! అని కాళ్లు కడుపులు పట్టుకొని చిత్తూరుమహారాణీ వేడుకొనినది. ఆదుర్మార్గుల నొకసారి బాబూ! అని పిలిచిన, నచిరకాలములో, బావలై సిద్ధపడుదురు శివ! శివా! రాజపుత్రు లెన్నడైన నట్టి చుట్టరికము నంగీకరింప గలరా? అసలీ మహమ్మదీయులతో సంబంధము పెట్టుకొనుటయే చాల బుద్ధితక్కువ. ఇట్టి క్లిష్టపరిస్థితులలో సంగమహా

రాణావలె రాజపుత్రులనందఱి నేకముఖముగ నడిపించి మహమ్మదీయుల పీచమడంపగల వీరాధివీరునే రాణా చేయుట అత్యంతావశ్యకము. ఈ విక్రమజిత్తు సర్వసమర్థులయిన రాజపుత్రయోధులను విడనాడి మహమ్మదీయులను, పదాతులను, ఆశ్రయించుచున్నాడు. తుపానుగాలిలో, అన్యసహాయము సిద్ధింపనపుడు, ప్రతివృక్షము తన పాదములమీదనే తాను ఆధారపడి యుండవలయును. 'ఉద్ధరే దాత్మనాత్మాన'మ్మని బోధింపలేదా గీతాచార్యుడు.

మాలోజీ—బాబూ! ఈ బాలరాజులతో మొగము మొత్తినది. రత్నసింహుడు, అంబరరాజకుమారిని రహస్యముగా ప్రేమించినాడే గాని, వెంటనే వివాహప్రయత్నము దల పెట్టలేదు. హారసింహు డాసంగతి దెలియకుండగనే ఆరాజపుత్రికను పెండ్లాడెను. తరువాత రత్నసింహుడు, హారసింహుడు యుద్ధమునకు దిగుటయు, రణరంగమున ప్రాణములు గోలుపోవుటయు సంభవించినది. అతనితరువాత మల్లయుద్ధప్రియుడు, పదాతిపక్షపాతి, అయిన ఈ విక్రమజిత్తు దాపరించినాడు మఱల మూడవపర్యాయము బాలకుని సింహాసన మెక్కించుట అయుక్తము. వనవీరుడన్నతో చాల యోగ్యుడు, పేరెన్నికగన్న వీరుడు, రాజతంత్రమునందు, సైన్యము నడుపుటయందు, ప్రఖ్యాతి గన్నవాడు. అతడు నిరాకరించినచో మనలో రాజప్రతినిధిగ నుండదగినవా రెవరు?

కాంజీ—నేను మాలోజీతో నేకీభవించుచున్నాను. మన మీవిషయమును వ్యవహారదృష్టితో జూడవలయును. వన

వీరుని సహాయములేకుండ మనము కోటను స్వాధీనము చేసికొనలేము, విక్రమజిత్తును రాజ్యాధికారమునుండి తొలగింపలేము. వనవీరుడు తలచినచో సిపాయీలు వచ్చునంతవఱకు, కోటను గాపాడగలడు. అతని మనలో గలుపుకొందుమేని, అతడు మనకు కోటను స్వాధీనము చేయగలడు, వెంటనే వర్తమానము పంపకుండ ఉపేక్ష చేసి, ఇతరప్రదేశములనుండి సైనికులు రాకుండ జేయ గలడు. అతడే పూనుకొన్నచో సైన్యము నాయత్తపఱచి, కోట మనకు స్వాధీనముకాకుండ జేయగలడు, తాత్కాలికముగ మనలను దేశమునుండి తరిమివేయ గలడు. మనమా, చిరకాలముక్రింద పడలివేసిన అశ్వికదళమును వెంటనే సమకూర్పలేము. కాబట్టి వనవీరుని రాజుగ జేయు టయే యుక్తమని తోచుచున్నది.

కరంచందు—ఈపరిస్థితులలో నింతకన్న మంచిమార్గము వేరొకటి లేదు. మనదేశచరిత్ర పరిశీలించిన, అవసరమునుబట్టి, సక్రమముగ రాజ్యమునకు రావలసినవానిని ద్రోసిపుచ్చి, ఇతరునికి రాజ్యమిచ్చినసందర్భములు కనుపట్టకపోవు.

కొఠారి—అయితే, ఉదయసింహుడసలే రాజ్యమునకు రాగూడదనియా, నీ ఆశయము. సంగమహారాణాసంతతి నేటితో రాజ్యమునకు నీళ్లు వదలుకొనవలసినదేనా! రాజకుమారుని రక్షించుటకు ధుంధేరాప్రభువు పడినపాట్లన్నియు వ్యర్థమై పోవలసినదేనా?

కరంచందు—అట్లెన్నడును భ్రమపడవద్దు. సంగరాణాను నా కన్న నధికముగా నభిమానించువారు లేరు. జీవితాంతము

వఱకు వనవీరుని రాజ్యము చేయనిత్తము. అతనికి కొడు కులు లేరు. ముందు కలుగుదరను ఆశయము లేదు. కావున నతనియనంతరము సహజముగా ఉదయసింహుడు రా జగును. ఉదయసింహుని, రాజ్యపాలనమునందు సుశిక్షి తుని జేయుటకు వనవీరుడు సంతోషముతో నంగీకరించును. అదియును గాక, అతనికి రాజ్యమందంతాశ యున్నటు లగుపట్టుట లేదు. అతనికి రాజ్య మంటకట్టుట ఎంతకష్ట సాధ్యమో మీరే గమనింపగలరు. ఉదయసింహుని భావి భాగ్యోదయమున కత డెప్పుడును అడ్డుపడబోడు.

**కొఠారి**—అది యొక నిబంధనముగ జేసిన బాగుగ నుండు నేమో ?

**కరంచందు**—అట్లు గావించుట సమంజసము గాదు. వనవీరు డట్టి అనుమానమున కెట్టియవకాశము నొసగియుండ లేదు. భారమంతయు నతనికే వదలివేయుదము. దాన సర్వము చక్కబడగలదు.

**కాంజీ**—విక్రమజిత్తు, అతని యనుచరులు, పెట్టుబాధలను మనము పడజాలకున్నాము. ఎప్పటికప్పుడు ప్రాణసంశయస్థితి యుదయించుచున్నది. ఇట్టియెడ వనవీరునకు గొన్ని నిబంధనలు విధించుట భావ్యము గాదు. మన జయాప జయములు, జీవితమరణములు, గౌరవాగౌరవములు సర్వము, ఆవనవీరునియం దాధారపడి యున్నవి. జాగు చేయక వెంటనే మనమొకనిర్ణయమునకు రావలయును, లేనిచో మన మీప్రళయమునుండి తప్పించుకొనలేము. ఇంక బ్రతికియుండునంతవఱకు విక్రమజిత్తునకు బాదా

క్రాంతములమై యుండవలసివచ్చును. అయితే విక్రమజిత్తు పక్షమున నుండదలచుకొన్నవా రెవరు ?

**అందఱు**—ఇచ్చట నెవ్వరు లేరు.

**కాంజీ**—కాలాంతరమున, ఉదయసింహుడు రాజగుటకు సమ్మతించి, ఈ ఆపత్కాలమున వనవీరుని రాణాను జేయుట కంగీకరించువా రెవరు ? (అందఱును అంగీకారమును సూచింతురు.)

**కాంజీ**—అయితే మనమందఱము వనవీరునిోద్ద కేగి, ఈ వృత్తాంతము వినిపింతము. కానీ, రాణాగారి ఉంపుడుకత్తె సీతలసేనికుమారుని రాజును జేయుట చాల విచిత్రముగనే ఉండును. అంతకన్న గత్యంతరము లేనప్పుడు మనమేమి చేయగలము. విచారించిన నిది తాత్కాలికమయిన ఏర్పాటేకదా !

**మాలోజీ**—అతడు, వీరాగ్రేసరచక్రవర్తి పృథ్వీరాజు తనూభవు డనుసంగతి మనము మఱచిపోరాదు.

**కాంజీ**—ఔను, ఆసంగతి నిజమే. సీతలసేనియొక్క నీచమయిన లోభక్రౌర్యదురాశాద్యవలక్షణము లణగిపోయి, పృథ్వీరాజుయొక్క ధైర్యసాహసౌదార్యస్వార్థత్యాగాద్యుత్తమలక్షణములే ప్రకాశింపగలవని ఆసింతుము. ఇంకొకగంటలో మనము బయలుదేరవలయును. మీరందఱు సంసిద్ధులు కండు. ఈమన రహస్యాలోచనలగూర్చి యితరులకేపాటి ఆచోకీ తెలిసినను ప్రయత్నమంతయు భగ్నమైపోవును. కావున నప్రమత్తులరై మెలగుడు.

(అందఱు నిష్క్రమింతురు.—తెర వ్రాలును.)

# మొదటి అంకము

## మూడవరంగము

[స్థలము—వనవీరునిమందిరములో నొకగది. కాలము—ఆనాడే మధ్యాహ్నము 2-గంటలు. వనవీరుడును, మాలోజీ, రహస్యాలోచనము చేయుచుందురు.]

**వనవీరుడు**—అయితే, మనతంత్రము పారి, నాతండ్రి యెంతయో అపేక్షించిన చిత్తూరుసింహాసనము నాకు సమర్పింపవచ్చుచున్నారా!

**మాలోజీ**—ఔను వారొకగంటలో రాగలరు. ఆట సభముగియగనే నీకీవృత్తాంత మెఱిగించి, అనంతరకరణీయమునకు, సంసిద్ధుని గావింప బరువెత్తుకొని వచ్చితిని

**వనవీరుడు**—నేను నీవలన నపేక్షించినదియు నంతియే. ఈ విషయములో వారందఱు నేకగ్రీవముగ నున్నారని నీకు నమ్మకమేనా?

**మాలోజీ**—నిస్సందేహముగా.

**వనవీరుడు**—విక్రమజిత్తు సింహాసనచ్యుతిగాని, నాసింహాసనారోహణముగాని ఆక్షేపించువారు లేరా?

**మాలోజీ**—ఒక్కరును లేరు.

**వనవీరుడు**—వారసత్వమునం దత్యంతాదరముగల కొంతారి చౌహాణుడు గూడ నంగీకరించెనా ?

**మాలోజీ**—అందఱితో బాటు అతడు విక్రమజిత్తు దొలగింప దొందరపడుచున్నాడు. అతడు, దర్శనానికి బోవ, విక్రమజిత్తు మూడుగంటలు పడవైచి యుంచినాడు. దానితో నతనికి మొగము మొత్తినది. తరువాత, కరంచందునకు జరిగిన ఘోరపరాభవముతో సర్వము సుసంపన్నమయినది ఉదయసింహుని రాజు చేసి, అతనికి నిన్ను, ప్రతినిధిగ జేయనగునని చౌహాణుడు పలికినాడు. కాని మేమందఱము నీవు ప్రతినిధిత్వ మంగీకరింపవనియు, రాజ్యము గూడ నంగీకరింతువో, లేదో అనుసందియ మున్న దనియు గట్టిగా జెప్పుటచే నతడు మాఱుమాటాడలేక పోయినాడు.

**వనవీరుడు**—ప్రతినిధిత్వమే అయినచో ముమ్మాటికిని నిరాకరించి యుండెడివాడను. అందులో ఆయాసమే కాని అనుభవము లేదు; ఎటు చూచినా నియమాలు, నిబంధనలే. అంతేకాకుండ, ప్రజలందఱు రానున్న ప్రభువున కెదురు చూచుచుందురు. క్రొత్తరాజు రాజ్యానికి వచ్చినతరువాత, ప్రతినిధికి గలుగుపాట్లు భగవంతునకు దెలియవలసినదే. అట్టి పాపిష్టిపదవి ఎవరికి గావలయును. నియమాలు నిబంధనలులేని రాజ్యసమర్పణమంటే దానిసంగతి వేరు. మాలోజీ! పూర్వపురాణా లెట్టిగౌరవాదరములు బడసిరో అట్టి గౌరవాదరములు నాకు గూడ లభించునా ?

**మాలోజీ**—అందఱు నిన్ను దప్పక మన్నించి గౌరవింతురు.

**వనవీరుడు**—రాజపుత్రుల కాభిజాత్యమునం దెంత గాఢాభిమాన మున్నదో నీ వెఱుంగనిది కాదు. మాతృకులమును, పితృకులమును వారు సవిమర్శముగ బరీక్షింతురు.

**మాలోజీ**—నిజమే, కాని, ప్రవాహములకు, రత్నములకు, మహర్షులకు, రాజులకు, జన్మస్థాన మెట్టిదనుపరీక్ష పెద్దలు చేయరు. వర్తమానస్థితిచే, ప్రవాహాదులకు గౌరవము గలుగును, కాని, పుట్టుపూర్వోత్తరములవల్ల వానికి అగౌరవము సిద్ధింపదు.

**వనవీరుడు**—నీవటులు తలంచుట సంతోషకరము. అట్టి దృక్పథమే సమంజస మయినది. సరేకాని, రాజ్యభ్రష్టుడయిన విక్రమజిత్తును వారేమి చేయదలచుచున్నారు?

**మాలోజీ**—సాధారణముగా, రాజుగారి పదచ్యుతికిన్ని, ఆయనహత్యకున్ను వ్యవధి చాల తక్కువగ నుండునన్న సంగతి అందఱు నంగీకరించునదియే. రాజునకు బొత్తుగా శత్రుశేష ముండదగదనియు, దేశక్షేమ మాసించి నరపాలుడు శత్రువులను దప్పక తుదముట్టింపవలయుననియు నీతిశాస్త్రజ్ఞులు శాసించియున్నారు.

**వనవీరుడు**—నామతము గూడ నదియే. కాని సామంతుల అభిప్రాయ మేమి ?

**మాలోజీ**—విక్రమజిత్తు పేరుచెపితే సామంతులందఱు మండిపడి పోవుచున్నారు. ఎవరైనా అతన్ని దుదముట్టించిన, వారికి సంబరము.

**వనవీరుడు**.—ఉదయునివిషయములో వారిఅభిప్రాయ మేమి?

**మాలోజీ**—అతనివిషయము నీకే వదలివై చెదరు. కొందఱు మాత్రము, నీయనంతరము, అతడు రాజు గాదగుననియు, వానిని నీవై రాజ్యపాలనమున సుశిక్షితుని గావింపవలయు ననియు దలచుచున్నారు. అట్లు తలంచుటకన్న విపరీత మేముండును ? ఉదయసింహుడు బ్రతికియుండునంతవఱకు నీకు బ్రమాదము దప్పదు.

**వనవీరుడు**—రాజయినవా డది సహింపలేడు.

**మాలోజీ**—ఇరువురుసోదరులు నొక్కసారిగా నిష్క్రమింప వలసినదే. పెద్దలు చేసినతప్పులకు, పిన్నలు శిక్ష పొంద వలయును గదా !

**వనవీరుడు**—అది ముమ్మాటికిని సత్యము. నీవు కడు విశ్వాస పాత్రుడవు, నా కత్యంతాప్తుడవు. రాజా నైనతరువాత నీఋణము తీర్చుకొందును.

**మాలోజీ**—నేను ప్రతిఫలాపేక్షతో బ్రవర్తించుట లేదు, కాని, నీయనుగ్రహము సంపాదించుకొనగలిగినందుల కెంతయు సంతసించుచున్నాను.

**వనవీరుడు**—నేనాసంగతి నెఱుగుదును కావుననే, నిన్ను విశ్వసించుచున్నాను. నీవు నన్నెట్టిస్థితియందును విడనాడ వని నమ్ముచున్నాను. ఆగుము. గుఱ్ఱములసందడి వినవచ్చు చున్నది. వారు సామంతులై యుందురు. వెంటనే నీవిట నుండి వారికంట బడకుండ దాటిపోయి, ఒక అరగంటలో దిరిగిరమ్ము.

**మాలోజీ**—ఒకమాట—సింహాసనము గ్రహించుట కత్యా తురతతో నున్నట్లు ప్రవర్తింపకుము. వారందఱు నీ కాళ్ల

వ్రేళ్లబడి బ్రతిమాలునంతవఱకు బెట్టు సరిచేయుము. అట్లయినచో, దరువాత, నీవు శత్రువులను రూపుమాపి నపుడు వారు నిన్నేమియు ననజాలరు. వారందఱు రాజ్య మును నీమెడకు గట్టవలయునని వచ్చుచుండుటచే నీవు వలదన్నను వా రింకొకని రాజును గావింపబోరు. ఈవిధ ముగ రాజద్రోహము దలపెట్టినతరువాత విక్రమజిత్తుతో సఖ్యపడలేరు. నేను నీకీరహస్యము దెలిపితి ననుసందే హము కలుగకుండునటులు ఇప్పుడే వెడలిపోయి తరువాత వచ్చెదను. (పాణిద్వారమున వెడలిపోవును. మఱుక్షణమే సేవకుడు ప్రవేశించును).

**సేవకుడు**—స్వామీ! కాంజీ, కరంచందు, కొఠారి మొద లైన సామంతప్రభువులందఱు, దమదర్శనమునకు వచ్చి యున్నారు.

**వనవీరుడు**—వారిని ద్వరగా దీసికొని రమ్ము. (సామంతులు ప్రవేశింతురు వనవీరు డెదురేగి సత్కారపూర్వకముగా వారిని సుఖాసీనులను గావించును).

**వనవీరుడు**—ఇంతమంది సామంతమిత్రుల ఆగమనముచే నాకుటీరము పావనమయినది. నాతండ్రి జీవించియుండి, ఈమహోత్సవము చూచినచో నెంత సంతసించెడివాడో కదా!

**కరంచందు**—మే మతనిపుత్రునకు రాజ్యము సమర్పింపవచ్చితి మని యెఱింగినచో నింక నెక్కుడుగ నానందమొందెడి వాడు.

**వనవీరుడు**—మీరు చెప్పుమాటలు నా కర్థమగుట లేదు. విక్రమజిత్తు, ఇంకను సజీవుడై రాజ్యము బాలించు చున్నాడు. నే నతనిమంత్రిని, సేవకుడను గదా ?

**కరంచందు**—విక్రమజిత్తుసంగతి నీవెఱుగనిది కాదు. అతడు యుక్తాయుక్తపరిజ్ఞానశూన్యుడు, చిన్నవాడు, నీచానురక్తుడు, కావున వంశప్రతిష్ఠ గంగలో గలిపినాడు; దినదినము సామంతులను బరాభవించుచున్నాడు; తనపదాతివర్గమును బోషించుటకు బీదలను బీల్చి పిప్పిచేయు చున్నాడు; త న్నెదిరించువారి నేమియు జేయలేకపోవు చున్నాడు కడకు, అక్రమాధర్మమార్గ మవలంబించి, ఒక జెట్టీవిధవచే నన్ను బరాభవింప సంకల్పించినాడు. ఆనీచుడంతసాహసముచేయలేక తికమక లాడుచుండగా, తన తండ్రి కెంతయో ఉపకారముచేసిన నన్ను నిండుకొలువులో జెంపలు వాయించినాడు. అతడు నన్ను బరాభవించుటలో సకలరాజపుత్ర సామంతమండలిని బరాభవించినాడు. ఈ అపచారములు గావించినకారణముచే నతని రాజ్యార్హత అంతరించినది.

**వనవీరుడు**—నలుగురిలోను నీయంతవానికంత అగౌరవము గావించినాడుగా ? అంతపని జరిగియుండునని నేను నమ్మలేకున్నాను.

**కాంజీ**—అందులో నతిశయోక్తి ఇంచుకేనియు లేదు. మా అందఱి సమక్షముననే అతడంత దురాగతమున కొడిగట్టినాడు.

**వనవీరుడు**—మీరందఱు సహించి ఊరకున్నారా ?

కాంజీ—వెంటనే మేమందఱము సమావేశమయి, సర్వప్రజలచే నిందింపబడుచున్న విక్రమజిత్తు నధికారమునుండి తొలగించుటకు, నీకు రాజ్యమర్పించుటకు, దీర్మానించుకొంటిమి.

వనవీరుడు—నేనడిగిన దావిషయము గాదు. పరాభవము జరుగకుండ నడ్డుపడలేకపోయినారా ?

కాంజీ—అది చాల అకస్మాత్తుగా జరిగినది అందుచే నేమియు జేయలేకపోతిమి.

వనవీరుడు—కరంచందుమహారాజా! మీకు సంభవించిన కష్టమునకు నాకు జాల విచారము గలుగుచున్నది. నీవంటి పరమోపకారికి, పురుషోత్తమునకు, నట్టి అపచార మొనరింప నతని కేమి పోగాలము వచ్చినది. అతనికి మతిపోయినదా ఏమి ?

కరంచందు—శెట్టీలవిషయములోను, సిపాయీలవిషయములోను, బరవశుడైనను, సామంతుల నగౌరవించుటలో నత డప్రమత్తతతో ప్రవర్తించుచున్నాడు.

కాంజీ—సామంతులందఱు అతని దాసానుదాసులట తాను వారి ప్రభువట!

వనవీరుడు—ఈ నవీనసిద్ధాంతము చాల ప్రమాదకరమైనదే. ఈ సామంతరాజకుటుంబమునకు, మహారాణా సంరక్షకుడన్నసిద్ధాంతమే నాకు నచ్చినది.

కాంజీ—ఆసంగతి దెలిసియే మేము నీకడకు వచ్చితిమి. రాజస్థాన ప్రజలపక్షమున చిత్తూరుసింహాసనము నీకు సమ

ర్థించుచున్నాము. నీవు మామనవి నంగీకరింపవలయును. ఓ సామంతసోదరులారా! నేను జెప్పునది మీకందఱకు సమ్మతమే కదా!

అందఱు—(అంగీకారసూచకముగ) జయ్. వనవీరమహా రాణాను జయ్.

వనవీరుడు—మీరు చూపిన అనుగ్రహమున కేనెంతయు కృతజ్ఞుడను. కాని నే నీరాజ్యము నంగీకరింపజాలను. ఇప్పుడు నాకు జాల సుఖముగ నున్నది. రాజ్యాధిపత్యము స్వీకరించినచో, అమాయికులయిన కృషీవలుల తగాదాల లోను, మదోన్మత్తులయిన సామంతుల దౌర్జన్యముల లోను మునిగి తేలవలసివచ్చును. ఈప్రస్తుత మనశ్శాంతి వదలుకొని గందరగోళములో దిగుట నాకంత ఆకర్షణీయ ముగ నుండలేదు.

కాంజీ—దేశక్షేమ మూసించి నీవు కొంతశ్రమ కోర్వవల యును. మహమ్మదీయులు, రాజస్థాన మాక్రమింప సమయ మునకు వేచియున్నారు తురుష్క్రులీరాజస్థానము బాలిం చుట నీకు సమ్మతమేనా? విక్రమజిత్తుగాని, అతని పదాతి సైన్యముగాని దేశము నీప్రళయమునుండి కాపాడుట దుర్లభము. ఈకష్టకాలమున, రాజపుత్రులను కూడ దీసి కొని వచ్చి దేశమును శత్రువులబారినుండి కాపాడగల బలిష్ఠుడే రాణా కావలయును. ఈదుర్బల విక్రమజిత్తే, ఇంక కొంతకాలము పరిపాలింపవలసియున్న, దేశమున కెట్టి దుస్థితి పట్టునో భగవంతునకే యెఱుక.

**వనవీరుడు**—ఉదయసింహుని రాణాను జేసి నీవుగాని, కరం
చందుగాని రాజప్రతినిధిగ నుండరాదా?

కరంచందు—అది ఆలోచనీయము కాదు. చందుమహాకవి
చెప్పినట్లు అర్భకులు, అబలలు పాలించురాజ్యము బాగు
పడదు. ఇప్పుడు కావలసినది రాజప్రతినిధి గాదు. భుజబల
పరాక్రమసంపన్నతచే దేశమును విపత్పరంపరనుండి, ఉద్ధ
రించి మహమ్మదీయులను రూపుమాపగల వీరాధివీరుడు
కావలయును ఏమీ మాటాడవు! వీరసింహుడయిన
పృథ్వీరాజపుత్రునకు మా చేసినవిన్నపము నిరర్థకము గా
వలసినదేనా? (సేవకుడు వచ్చి మాలోజీ ఆగమనము
దెలిపిపోవును. మాలోజీ ప్రవేశించును. వనవీరు డాతని
సుఖోపవిష్టుని గావించును)

వనవీరుడు—(మాలోజీనుద్దేశించి) ఈ మనమిత్రులు, దేశ
మును శత్రుదండయాత్రలనుండి కాపాడుటకు, రాజ్యాధి
పత్యమును బూనవలయునని నన్ను జాల మొగమోట
పెట్టుచున్నారు. నాకు రాజ్యాశ లేదని యెంత విస్పష్టముగ
జెప్పినను, అంగీకరించుట లేదు. ఈవిషయమున నాకేదైన
నుపాయము సూచింపలేవా?

**మాలోజీ**—రాజస్థానమం దెందఱు గాలించినను, ప్రస్తుతస్థితి
కుపకరించుసమర్థుడు వేరొకడు లేడు తగినవా రందు
బాటులో నున్నప్పుడు చిత్తూరు రాజ్యవినాశమున కవ
కాశ మొసంగుట తగనిపని కదా! ఈ విపత్సమయములో,
పృథ్వీరాజాత్మజునకు, చిత్తూరు సంరక్షణమునకు దోడుపడ
నిరాకరించుట కెట్టియధికారమును లేదు.

కాంజీ—మాలోజీ! నీవు చెప్పినది కడు యుక్తియుక్తముగ నున్నది. వనవీరా! ఇంక నీకు దప్పదు. కాబట్టి మా మాట మన్నించి రాజ్యము స్వీకరింపుము.

వనవీరుడు—మిత్రులారా! రాజు కావలయు ననునాశ నాకేమాత్రమును లేదు. అదియుగాక సామంతులందఱు, ఈనా రాజ్యగ్రహణమున కంగీకరింతురో లేదో తెలియదు.

కాంజీ—అందఱు నిన్నంగీకరించి మన్నింతురు. అందులో సందియ మావంతయు లేదు. సోదరులారా! నామాట సత్యమే కదా!

అందఱు—ముమ్మాటికిని సత్యమే. మేమందఱము వనవీరుని పక్షమువారమే.

వనవీరుడు—నాకు బొత్తిగా నిష్టములేనిపనికి బూనుకొనుమని, నన్ను మీరు నిర్బంధించుచున్నారు. తరువాత నా శక్తిసామర్థ్యములగూర్చి మీరేమనుకొన్నను లాభము లేదు.

అందఱు—అట్లేల జరుగును?

వనవీరుడు—అట్లయిన, విక్రమజిత్తును, తత్పక్షమువారిని ఏమిచేయవలయును?

కాంజీ—అది నీవై నిర్ణయింపదగినవిషయము. నీవు చేసిన దానిని మేము కాదనువారము కాము.

వనవీరుడు—అంతఃకలహములన్న నాకు గడునసహ్యము. ఏ ఒక్క రాజపుత్రుడయినను విక్రమజిత్తుపక్షమున నుండ దలచినచో నా కీరాజ్య మక్కఱలేదు.

కాంజీ—సిపాయీలు తప్ప రాజపుత్రు లెవ్వరు విక్రమజిత్తు పక్షమున నిలువరు. ఆసిపాయీలైనను మనలను జూచిన తత్క్షణము పారిపోవువారే. ధైర్యసాహసాదులు వారెఱుగనివిషయములు.

వనవీరుడు—ఆసిపాయీలగూర్చి మనము విచారింప నవసరము లేదు. రాజపుత్రులందఱు నొక్కమాటమీద నున్నారు గదా!

కాంజీ—వారందఱు నీవు రాజ్యాధికారము పూని తమ్ము గాపాడ గోరుచున్నారు.

వనవీరుడు—ఉదయసింహుని రాజు చేయవలయుననిగాని, అతని నెచ్చటికైన దీసికొని పోయి, అతనిపేరిట దిరుగుపాటు చేయింపవలయుననిగాని దలచు రాజపుత్రు లెవరైన గలరా?

కాంజీ—ఉదయసింహు డీ కోటలోనే నీయధికారమునకు లోబడియుండునటులు చూడగలము.

వనవీరుడు—విక్రమజిత్తువిషయమున, అతని అనుచరుల విషయమున, నాయిష్టానుసారము ప్రవర్తించిన మీకెట్టి యభ్యంతరము లేదని మీరు నాకు బాస యిచ్చెదరా?

అందఱు—అటులే కావించెదము.

వనవీరుడు—మీమాట ద్రోసివేయలేక తప్పని సరిగ, ఈకిరీటాధిపత్య మంగీకరించెదను.

అందఱు—జయ్, వనవీరమహారాణాకు, జయ్.

కాంజీ—నేడే మాసైన్యముల నన్నిటిని ఆయత్తపఱచెదము. రేపు కోటను స్వాధీనము చేసికొని, విక్రమజిత్తును సింహా

సనమునుండి తొలగించి నీకు రాజ్యాధిపత్య మొసంగె దము. నీ సైనికులసాయమున కోటను స్వాధీనము చేసి కొనుటలో గష్టముండదు. సిపాయీబలమునకు, ఇంకా వర్తమానము పంపలేదు కదా!

**వనవీరుడు**—ఇంతవఱకు బంపలేదు. ఇటుపై పంపునదియు లేదు.

**కాంజీ**—అటైన రేపు మధ్యాహ్నమే నీవు రాజవయ్యెదవు. మాయీవిన్నపము మన్నించిన నీకు మేమెంతయు గృతజ్ఞులము.

**వనవీరుడు**—నాకిది యంత సమ్మతమయిన పనికాదు. అయినను దేశమాత ఆహ్వానమును త్రోసిపుచ్చ వీలులేదు గదా!

(అందఱు నిష్క్రమింతురు. తెర వ్రాలును)

# రత్నప్రభ

## రెండవ అంకము

### మొదటిరంగము

[చిత్తూరు రాజభవనములో నొకగది. రాత్రి 7 గంటలు. ఉదయసింహుడు హంసతూలికాతల్పముపై పరుండి నిద్రపోవుచుండును. అమరుడు క్రింద చాపపై నిద్రించుచుండును. పన్నా పళ్లెములు సవరించుచుండును. సభాభవనమునుండి, అంతఃపురమునుండి ఏడ్పులు వినబడును. సింహాసన మంటపమునుండి, జయజయ ధ్వానములు, శంఖారావములు, భేరీనాదములు, వినవచ్చును. పన్నా ముఖవికాసము తగ్గిపోవును. జగ్గు. తలుపుతెఱచి ప్రవేశించును.]

పన్నా—జగ్గా! ఆఏడ్పులు, పెడబొబ్బలు, ఆమోతలు, డబడబలు, ఏమిటి. ఆ గొడవా అదేనా—?

జగ్గు—అంతకన్న ఇంకా ఏముంటుంది. రాజ్యానికొచ్చిన వనవీరుడు, విక్రమజిత్తుతల నరికించాడు. అందుకోసం, చచ్చిపోయిన రాణావెళ్లాలు ఏడుస్తున్నారు. కాంజీ, వనవీరుని

నెత్తిన కిరీటం పెట్టేటప్పుడు, అక్కడ ఉండే జనం అంతా, జయ్ జయ్, అని పెద్దపెద్ద కేకలేశారు.

పన్నా—అయితే, అంతా మనం అనుకున్నట్టే జరిగిం దన్న మాట. విక్రమజిత్తు తాబేదారును నేను, నాకు రాజ్యం ఎందుకు? అని అంత బెట్టుసరీ చేసి, వనవీరుడు, రాజ్యం కాజేయటమే కాకుండా పాపం! విక్రమజిత్తును గూడ చంపించాడే.

జగ్గు—పన్నా! ఇందులో చిత్రం ఏముంది. రాజ్యాలొద్దన్న బాబు లందఱికీ రాజ్యా లక్కరలేదన్నమాటేనా? అందు బాటులోకి ఒచ్చిందంటే రాజ్యం, వాళ్లు గుటుక్కున మింగేస్తారు. రాజులున్నారు చూశావు—వాళ్లు ఒకళ్ల నొకళ్లు—చేపలను తిన్నట్టుగానే—తినేస్తారు. వాళ్లు చంపన్నా చంపాలి లేకపోతే చావన్నా చావాలి. ఇంతకీ రాజ్యాన్ని కాజేసినవాడు, అసలురాజును చంపకుండా ఎట్లా ఉంటాడు.

పన్నా—చివరకు నమ్ముకున్నవాని చేతిలోనే చచ్చాడే విక్రమజిత్తు. ఇకముందు ఏం జరుగుతుందో?

జగ్గు—జరిగేందుకు ఏముంది. ఇప్పుడు వనవీరునితో ఉన్న దొరలు మళ్లీ ఎప్పుడో అతనితో దెబ్బలాడుతారు. సంగ రాణా కుటుంబంవాళ్లు ఎవళ్లైనా చావకుండా మిగిలితే వాళ్లను వెనకేసుకొని అతన్ని కాస్తా సాగనంపుతారు.

పన్నా—దేవుడిధర్మమా అంటూ ఉదయసింహుడు బ్రతికి ఉన్నాడు.

జగ్గు—ఇతడూ ఆ ట్టేకాలము బతకడేమో అని నాభయం. ఇప్పుడో కాసేపటికో అతనిపని గూడ పూర్తిచేస్తారు ఈ చిన్నబాబు ఎంత సుఖంగా నిద్రపోతున్నాడు. పాపం పిల్లలకు భయాలు గియాలు లేవు గదా! తమర్ని చంపే వాళ్ల ఇంట్లోనైనా గుఱ్ఱుకొట్టి నిద్రపోతారు. అయ్యో! ఏఏకష్టాలు రాబోతున్నాయో ఈ బాబయ్యకు తెలియనే తెలియదు కదా ?

పన్నా—విక్రమజిత్తును పట్టుకోటం, సిపాయీలు పారిపోటం అంతా, ఉదయుడు, అమరుడు, కిటికీలోనుంచి చూచారు. దానితో హడిలి పోయి, ఉదయుడు, "పన్నా! ఆ వన వీరుడిమొగం ఎట్లా ఉందో చూడు, మా అన్నయ్యను, నన్ను ఏంచేస్తాడో అని భయమేస్తోంది" అని అన్నాడు. "నేను బతికి ఉన్నంతవఱకు నీకేం భయంలేదు బాబూ!" అని ధైర్యం చెప్పి మామూలుకన్న పెందరాడే నిద్ర పుచ్చాను. ఎట్టాపోయి ఎట్టా ఒస్తుందో అని అమరుణ్ణి గూడా ఇక్కడనే పడుకోపెట్టాను. పిల్లలకు, రాత్రి గాఢంగా నిద్రపడుతుందని పాలల్లో మత్తుమందు కలిపి తాగించాను.

జగ్గు—మంచిపనే చేశావు. ఈబాబు మేలుకోకుండా, కత్తి పోటుబాధ పడకుండా ప్రాణాలు విడిచేస్తాడులే.

పన్నా—పన్నా బతికి ఉన్నంతవఱకు, అతనిమీద ఒక ఈగైనా వాలలేదు. తెలుసునా ?

జగ్గు—వనవీరుణ్ణి, ఆయన పెద్దసైన్యాన్ని, నీవంటి ఆడది ఏం చేయగలదు?

పన్నా—ఏం చేస్తుందో నీకేం తెలుస్తుంది. నాసంగతి నీకింకా బాగా తెలియలేదు.

జగ్గు—ఇరవైఏళ్లనుంచి మనమిద్దరం ఇక్కడనే కలిసిమెలిసి ఉంటూన్నప్పుడు, ఒకరిసంగతి ఒకరికి తెలియదంటావా?

పన్నా—ఎన్నేళ్లైనా తెలియనివాళ్లకి తెలియనే తెలియదు. సరేగాని, ఇన్నాళ్లనుంచి ఈదొరలసొమ్ము తెగదింటూ, ఈ రాజకుమారుడు చచ్చిపోతూంటే చూస్తూ ఊరుకుంటావా? జగ్గూ! దొరలరుణాన పడిపోతావా?

జగ్గు—(కంగారుపడి) పన్నా! నేనేం చేయగలను. దిక్కులేని వంటవాణ్ణి, మావంటికూలివాడు ఏం చేయగలడు. ఎవరు దొరలైతే వారినౌకరీ చెయ్యాలా, ఒద్దా?

పన్నా—ఛీ, ఛీ, అహోరించినట్టే ఉంది నీవాదం! అట్టాగే అయితే నీకూ, ఈకోటలో ఉండే పందికొక్కుకు భేదం ఏముంది. దానికీ పొట్టకుంటే చాలు, నీకు పొట్టకుంటే చాలు. ఇద్దరికి ఎవరు రాజైనా ఒకటే. నీలో ఇంతకంటె మంచి పౌరుషం ఉందని పొరపడ్డానే.

జగ్గు—పన్నా! నా మాట కూడా విను.

పన్నా—వినేందు కేముంది? వనవీరునిదౌర్జన్యం, నీ పిరికితనం రెండూ కొంపలీసేవే.

జగ్గు—పోనీ, వంటచేసి అంట తప్పాలాలు తోమేవాణ్ణి నేనేం చెయ్యగలనో చెప్పు.

పన్నా—వంటలు చేసినా? అంట్లు తోమినా అందులో ఏమీ లేదు. మనిషై పుట్టిందాక ధైర్యమూ సాహసమూ

ఉండాలి. నీతీ, జాతీ, మంచీ, చెడ్డ, లెక్కలోకి వస్తాయి గాని, పొట్టకూటికోసం చేసేవృత్తి లెక్కలోకి రాదు. (క్షణమాలోచించి) జగ్గూ! నాకో ఆలోచన తటుతోంది. నువ్వు సాయం చెయ్యాలి. చేస్తావా?

జగ్గు—పన్నా! నేను చేయగలదేదైనా ఉంటే చెప్పు. ఏమైతే అదౌతుంది చేసేస్తాను.

పన్నా—నీవామాట అన్నందుకు నాకు చాలా సంతోషమైంది. చెప్పినపని కాదనవని నాకు తెలుసు—జగ్గూ! ఈ చిన్నబాబుని, ఆ రాక్షసిముండాకొడుకు చేతులో పడకుండా, రక్షించాలి.

జగ్గు—బాబో! అంతపని మనం చెయ్యలేం. దేశంలోఉన్న మూడువేలసిపాయీలను పిలుచుకురావటానికి మనుష్యుల మీాద మనుష్యుల్ని ఉరికించారు. ఎవరైనా వనవీరుడి కెదురు తిరిగారంటే వాళ్లని, కాళ్లకింద రాచి చంపేస్తారు. అదీకాకుండా వనవీరుడి పెద్దకొడుకులు, మాలోజీ, సోలంకి, ఉన్నారే వాళ్లదగ్గిర పెద్దపెద్ద సైన్యాలున్నాయి, ఎప్పుటికప్పుడు ఎవరిమీాదికి పడితే వారిమీాదికి ఉరకటానికి సిద్ధంగా ఉన్నాయి. అలాటప్పుడు డబ్బుగాని, తుపాకీ మందుగాని, మంచి సైన్యంగాని లేని మిగతా దొర లేంచేయగలరు? దొరలకే చేతకాకపోతే, నువ్వూ, నేనా ఈ ఉదయసింహుణ్ణి రక్షించటం

పన్నా—ఎట్టాగో అట్టా తంటాలుపడి, ఈ చిన్నాయన్ని, ఇక్కడనుంచి తప్పించామంటే, ఆతరువాత ఫరవాలేదు. చిత్తూరుబయట ఉన్నరాజపుత్రు లెవరూ, సంగరాణా

కొడుకు చచ్చిపోతూ ఉంటే చూస్తూ ఊరుకోరు. ఇక్కడైనా ఈయన్ని రక్షించేవారు ఉంటారుగాని, వాళ్లు వనవీరుడికి భయపడి ఊరుకుంటారు.

జగ్గు—అసలు ఇక్కణ్ణించి తప్పించేదెట్లా ?

పన్నా—ఎట్లాగా! చెపుతా విను. ఒకపళ్లబుట్ట తెచ్చి, అందులో చిన్నరాజును పడుకోపెట్టి, ఆపైన ఆకులు కప్పేస్తా. నీవా బుట్టను నెత్తినబెట్టుకొని కోటదాటి బేరీ నదిలో ఉన్న ఏనుగులగుట్టచేరి అక్కడుండు, తరువాత అక్కడకు నేను వస్తాను నీవు వంటవాడవు, మామూలుగా బుట్టలు పట్టుకుపోతూ ఉండేవాడవు కాబట్టి నిన్నెవరూ అనుమానించరు. వనవీరుడుగారు రాజ్యానికివచ్చిన ఉత్సవసందర్భంలో, ఎవరికో పళ్లు పట్టుకువెడుతున్నా వనుకుంటారు. ఏనుగులగుట్టకు చేర్చినతరువాత ఈయన్ని దేవలపట్నానికో, దంజరుపురానికో, కుంభాల్మరుకో తీసుకుపోదాం. చిత్తూరుముట్టడిలో యుద్ధంచేసి చచ్చిపోయిన భాగ్జీవున్నాడే, ఆయనతమ్ముడు సింగరావు దేవలపట్నంలోనే ఉన్నాడు. ఆయన ఈపిల్లవాణ్ణి కాపాడుతాడు. ఆయన కాదంటే దంజరుపురంలో రావులు ఉన్నాడు ఆయన చిత్తూరురాజులకు చాలా కావలసినవాడు. ఆయన గూడా వల్లకాదని వదలివేస్తే కుంభాల్మరులో ఆశాసా ఉన్నాడు. ఆయనకు సంగరాణామీద చాలా గురి. ఆయన తప్పకుండా ఈవోరను శరణిచ్చి కాపాడుతాడు.

జగ్గు—అది నెరవేరేది కాదు పన్నా ! మనం వెళ్లింతరువాత ఉదయుణ్ణి చంపటానికి వనవీరు డొస్తాడు, అప్పుడు ఉద యుడు ఇక్కడ లేకపోతే దేశం అంతా గాలించి మన్ని పట్టుకుంటాడు. అయితే మనం సాహసం చేసినందుకు ఏం లాభం కలుగుతుందంటే, ఈచిన్నదొరను చంపేటప్పుడు మన్ని గూడా చంపేస్తారు. అదీకాకుండా, ఒకరోజు ప్రయాణాం ఐనా చేయందే నీవుచెప్పిన ఊళ్లల్లో ఏఊరూ చేరలేం. పెద్దపెద్ద బాబులపేర్లు చెప్పావే వారెవరూ, ఈయన్ని కాపాడాలనుకున్నా, వనవీరుణ్ణి ఆయనతో ఉన్న పెద్దపెద్దసైన్యాలనీ ఎదిరించి, బతకలేరు.

పన్నా—నీ వన్నట్టుగానే మనము తప్పించుకు పోయేలోపల వనవీరుడు మన్ని పట్టుకోవచ్చు.

జగ్గు—కాబట్టి ఈసంగతి ఒదిలేద్దాం. ఇంతకీ ఇట్టా అన్యా యంగా రాజ్యానికొచ్చింది వనవీరుడు ఒక్కడేనా ? ఉడా సింగు తనతండ్రినే చంపి సింహాసనం ఎక్కాడు. అది ఏమిటో రాజధర్మం అట. మనసంగతికి రాజులసంగతికి చాలా తేడా ఉంటుంది. నే చెప్పేది నీవేం వినటం లేదు. ఏమిటో ఆలోచిస్తూ ఉన్నావు !

పన్నా—అయితే ఈరాక్షసకృత్యం చేయటానికి వనవీరుడు మనుష్యులను ఎప్పుడు పంపిస్తా డంటావు.

జగ్గు—ఒకటి రెండుగంటల్లో. ఇంతగొప్పపని చేయటానికి వనవీరుడు స్వయంగానే ఒస్తాడు కాని తననౌకర్లని నమ్మి పంపించడు.

పన్నా—(ముఖము వికసింపగా) అట్లాగైతే అతన్ని ఈ బాకుతో పొడిచి చంపేస్తా. దాంతో ఉదయుణ్ణి కాపాడా వచ్చు, దొంగ రాజును మట్టుపెట్టావచ్చు.

జగ్గు—నీవా ? పన్నా !

పన్నా—ఔను, నేనే. నేను ఉత్తమ రాజపుత్రస్త్రీని. బాకుతో పొడిచి చంపటం మాకు బాగా తెలుసు.

జగ్గు—నీ తెగింపు, గుండెనిబ్బరము, దొరలమీద విశ్వాసం మంచివేగాని నీఆలోచన లేం నాకు నచ్చటం లేదు. వన వీరుడు, ఆయననౌకర్లు కత్తులు కఠార్లు పుచ్చుకొని వస్తారు. నీవు ఆయన్ని చంపబోయేలోపల, వాళ్లు నిన్ను ఇంత ఇంత ముక్కలకింద నరికేస్తారు. అతనిదగ్గిర ఉన్న వాళ్లు నిప్పు మింగి, నిప్పు కక్కుతారు. వాళ్లకు తోడేళ్లలాగ ఊహూా నెత్తురు తాగటమే పని. నిన్ను నరికేటప్పుడు నీ కొడుకును గూడా కత్తిరించేస్తారు. చావకుండా ఉంటే నీకొడుకు తల్లి లేనివాడై పోతాడు. అది ఒకటే ఈ నీవెఱ్ఱి తనానికి లాభం. మళ్లీ, నీవు వినటం లేదు. ఏమిటి ఆ సంగతి. ఆలా ఒణికిపోతున్నావు గూడా ఏం.

పన్నా—(ఒడలంతయు గంపింప నావేశముతో మాటలా డును). ఈరాజకుమారుని స్థానంలో ఇంకో కుఱ్ఱవాణ్ణి పెడతా మనుకో. ఆకుఱ్ఱాణ్ణే రాజపుత్రు డనుకొని వన వీరుడు చంపేస్తాడు. అప్పుడీ బాబుని మన మనుకొన్న చోటికి తీసుకుపోయి కాపాడ లేం. ఆతరువాత అదృష్టం గనక ఉంటే ఈయన రాజ్యానికి వచ్చినా రావచ్చు.

జగ్గు—ఈపన్నాగం సాగితే సాగొచ్చేమో. అయినా అందుకు పనికొచ్చేకుఱ్ఱాణ్ణి మన కెవరిస్తారు. హంసపిల్ల హంసకు ముద్దైతే, కాకిపిల్ల కాక్కి ముద్దు గాదూ. చంపటానికంటే ఎవరైనా తమపిల్లల్ని ఇస్తారా? అంత కటికగుండెవాళ్లు ఎవరైనా ఉన్నప్పటికీ, వాళ్లను వెతకటానికి చాలారోజులు పడుతుంది. వనవీరుడో ఇంకోగంటలో ఒచ్చేసేస్తాడు.

పన్నా—(కళ్లనిండా నీళ్లు తెచ్చుకొని) ఆపనికి అమరుణ్ణి ఉపయోగిస్తాను.

జగ్గు—పన్నా! ఘోరం, ఘోరం.

పన్నా—(జగ్గువైపున కొరిగి చేతులు మొగముమీద బెట్టికొని యేడ్చుచూ) ఇంకోదారి లేదు. జగ్గూ! వాడు చచ్చేదానికంటె, నేను చచ్చిపోవటమే నాకు చాల ఇష్టము. కాని వాడు చస్తేనేకాని ఉదయుడు బతకడు.

జగ్గు—పన్నా! రాజుకొడుకోసం నీకొడుకును జంపుకుంటావా ఏమిటి? నీకు రాజుకొడుకు ఎక్కువా? నీకొడుకు ఎక్కువా?

పన్నా—నాకు ఇద్దరూ ఒకటే. ఇద్దరినీ ఒకమాదిరిగానే పెంచాను. ఇప్పుడు రాజులరుణం తీర్చాలి. దేశంకోసం, రాజులకోసం, అమరుడు చచ్చిపోవలసిందే.

జగ్గు—పన్నా! అట్లా ఎందుకు జరగాలి?

పన్నా—ఏమిటూ తెలివితక్కువ ప్రశ్న—జగ్గూ! రాజులకోసం, మనకున్నదంతా అర్పించటానికి కారణాలు కావాలా? అది మనకు మొట్టమొదటిధర్మం. రాజభక్తికి

గాని పాతివ్రత్యానికిగాని కారణా లక్కర లేదు. కారణాలు కావాలంటే లక్ష ఉన్నాయి విను. అమరుడిబతుకంతా ఈ రాజకుటుంబంమీాద ఆధారపడి ఉన్నది. అతడు పెద్దవాడైన తరువాతైనా రాజుకోసం యుద్ధంచేసి చచ్చిపోవలసిందేగా? అట్టా యుద్ధంచేసి చచ్చిపోతానంటే, రాజపుత్ర కుటుంబంలో పుట్టిన నేను, వద్దనగలనా? ఇక ఏమిటంటే, అతడు చిన్నతనంలోనే నౌకరీలో జేరి, చిన్నప్పుడే రాజరుణం తీర్చుకుంటున్నా డన్నమాట. జగ్గూ! మేము రాజపుత్రులము. నౌకరీ తిన్నగా జేయకుండా తలాయించటానికి వీలులేదు. చావటానికి సిద్ధంగా ఉంటేనేకాని బతకటానికి హక్కు కలుగదు. ఆలస్యం ఏమాత్రం చేయటానికి వీలులేదు. ఇక్కడ పళ్లాలు అవీ సర్ది మీా పెద్ద వంటవాడివద్ద సెలవుపుచ్చుకొని వెంటనే రా. ఈరోజుకు నీపని అయిపోయింది కనుక నీకోసం ఎవరూ వెతుకరు. ఈలోపల దుస్తులు మారుస్తాను పిల్లలకు. నీవు వచ్చి ఉదయుణ్ణి బుట్టలో పెట్టుకొని కోట దాటించు. వనవీరపిశాచము వచ్చి నా ముద్దులతండ్రిని మట్టుపెట్టినవెంటనే వచ్చి నిన్ను కలుసుకుంటాను.

జగ్గు—పన్నా! నాగుండె పగిలిపోతోంది. ఈఘోరం, ఈబలి, ఈకన్నకొడుకును, సొంతతల్లి చేతులారా చంపించటం తలుస్తూ ఉంటే చచ్చేటంత భయంవేస్తోంది. ఏంచెప్పాలో, ఏంచెయ్యాలో, నాకేం తోచటం లేదు నీవు ఎన్ని అక్షరాలు పలికితే అన్ని అక్షరాలు చేసేవాననని నాకు తెలుసు. అంతకన్న నాకేమీా తెలియదు. నీ వేంచేయమంటే అది

చేస్తా. అయినప్పటికీ కడాపటిసారిగా నీకొడుకునుగూర్చి ఒకమాట చెపుతా విను. బతకటానికి ఉదయుడి కెంత హక్కుందో, అంతహక్కు అమరుడి కుంది. ఒట్టి పుణ్యానికి వాణ్ణి చంపించటానికి నీకు హక్కేం ఉంది? లేదు ముమ్మాటికి లేదు లేదు.

పన్నా—జగ్గూ! నన్నింక వేధించబోకు. రాజభక్తి సరియైన కారణంగా నీకు తోచకపోతే ఇది విను. మానసంరక్షణం చేసుకోటానికి చిచ్చులో బడి చచ్చిపోతూన్న కర్ణావతీ దేవికి, "ఉదయుని నా ఒకేఒక కొడుకులాగ, ప్రాణాన్నైనా అడ్డంవేసి కాపాడుతా" నని పెద్ద ఒట్టుపెట్టుకొని నమ్మించి చెప్పాను. ఐనా, ఆ ఒట్లసంగతి ఇప్పు డెందుకు? ఈరాజుకొడుకుకోసం, అమరుడు చచ్చిపోవటమే అవశ్యమైన ధర్మం. నీవు రాజపుత్రుడవు కావు కనుక నీకీ సంగతి సందర్భాలు అర్థం కావటం లేదు. ఉదయుణ్ణి బతికించటానికి, ఒకమార్గం కనబడుతూన్నప్పుడు, కొడుకుమీాద ప్రేమచేత, నేను కక్కుర్తిపడ్డానంటే, లోకం ఏమంటుంది? ఇన్నాళ్లనుంచీ పేరుప్రతిష్ఠలతో ఉన్న మావంశానికి తీరనికళంకం చుట్టుకుంటుంది. రాజునకు ద్రోహంచేసి, అతన్ని యుద్ధరంగంలో విడిచిపెట్టే సైనికులకు ఏందుర్గతి పడుతుందో, ఏం అమర్యాద వస్తుందో, ఏఏ ఘోరనరకాలు ప్రాప్తిస్తాయో, ఆ దుర్గతి, ఆ అమర్యాద, ఆ ఘోర నరకాలు, తప్పకుండా నాకు, నన్నుపట్టి ఈ ముక్కుపచ్చలారని అమరుడికి, మంచిచెడ్డలు పాపపుణ్యాలు ఎరుగని అమరుడికి, గూడ చుట్టుకుంటాయి. నాకొడుకైన అమరుడి

ప్రాణంకంటె, సంగతానాకొడుకైన ఉదయుడిప్రాణం ఎన్ని వేలరెట్లో గొప్పది. మహాత్మదీయులదౌర్జన్యాన్ని, దురాగతాన్ని, రూపుమాపే శక్తిసామర్థ్యాలు గలిగి, సాటిలేని కీర్తితో ధగధగలాడిపోతూ ఉన్న ఈ ఉత్తమరాజవంశగౌరవమంతా ఉదయుడిమీాద నిలిచి ఉంది. రాజులు రాజ్యంచేస్తూ ఉన్నంతవఱకు, వారిసేవకులు ఎప్పటికప్పుడు, ఆరాజులకోసం, చెప్పిన ఒక్కక్షణంలో, ప్రాణాలైనా అర్పించటానికి సిద్ధపడి ఉండాలి. నౌకర్లప్రాణంకంటె రాజులప్రాణం ఎన్నిరెట్లో విలువగలదని ఒప్పుకోవాలి, ఒప్పుకోటమే కాకుండా ఇతరులను ఒప్పించాలి గూడాను. జగ్గూ! ఇంకా ఆట్టే పిడివాదం చేయకుండా నేను చెప్పినట్టు చెయ్యి. (పళ్లాలు గిన్నెలు తీసికొని జగ్గు వెడలిపోను. పన్నా ఉదయునిబట్టలు అమరునికి, అమరుని బట్టలు ఉదయునికి తొడిగి, అమరుని హంసతూలికాతల్పముమీాద బరుండబెట్టి, ఉదయుని క్రింద చాపమీాద బరుండబెట్టును. జగ్గు తిరిగి ప్రవేశించును.)

పన్నా—(రాజకుమారవేషమున నున్న అమరుని రెప్పవాల్పక చూచుచు) నాయనా! నీకీవేషం ఎంత చక్కగా కుదిరింది. కాబట్టి దేవతలు గూడా నీ ఈబలిదానానికి సమ్మతించారన్నమాట. నేనైనా ఈ ఇద్దరిలో ఉదయుడు ఎవరో వెంటనే చెప్పలేను.. వనవీరుడు, అసలు అనుమానించటానికే వీలులేదు కనుక, ఈరహస్యం కనిపెట్టలేడు. అతడు వచ్చిన వెంటనే చేయదలచుకొన్న ఘనకార్యం కాస్తా తొందర తొందరగా నెరవేర్చి చేతులు కడుక్కొని వెళ్లిపోతాడు.

అంతే కాకుండా ఉదయసింహుడు చచ్చిపోయినాడని నేను గొంతెత్తి ఏడుస్తాను.

జగ్గు—క్రమక్రమంగా నాకు మతి పోతోంది. తల గిరగిర గిర గిరా తిరిగిపోతోంది. ఎప్పుడైనా, ఎవ్వరైనా ఇంత ఘోరంగా బలి ఇచ్చేశారని విన్నామా! కన్నామా? నీయందు నాకుండే గొప్ప అభిమానంచేత ఈపాపంలో పాలు పంచుకుంటున్నానుగాని లేకపోతే ఇటువంటిదానిలో జోక్యం కల్పించుకుంటానా? ఈలోకంలో నీకంటె నన్నాదరించే వారు ఎవరూ లేరు. కాబట్టి నీకోసం ఏపని చేయాలన్నా సిద్ధపడుతున్నాను........అయితే...చూడు...(పన్నా ముఖము దేరిపాఱ జూచుచు) ఈనాడు నీముఖం మామూలుగా లేదే? నీవు పన్నా వేనా? లేక దయ్యానివా? కాదు కాదు దేవతవా? నీముఖం చూస్తే నాకు భయం వేస్తోంది. కోటిసూర్యులు ఒక్కమాటుగా వెలిగి పోతూ ఉన్నట్టుంది. అబ్బా! ఈవెలుగు భరించలేను. (కన్నులు కొంతతడవు మూసికొని మఱల దెరచును) ఈ మాటు ఆ సూర్యులేరీ? లేరు, లెక్కపెట్టటానికి వీలుగానన్ని చందమామలు అగుపడుతున్నాయి. ఏమిటే ఈగందరగోళం అంతా? నేను నిద్రలో కలగంటున్నానా? లేక మేలుకునే ఉన్నానా? లేకపోతే నాకు మతే లేకుండా పోతున్నదా? ఇది ఏమిటే! రత్నాలు, వజ్రాలు, ఇంకా ఏమిటో ఏమిటో ధగధగా మెరిసిపోతూన్నవన్నీ కుప్పలు పోసినట్టున్నాయే. కొండమీదనుంచి చుక్కల్లా మిడిసి పడిపోతూ ఉండేవాళ్లు ఎవళ్లో చాలామంది నీ మెడలో

రత్నాలవేర్లు వేసిపోతున్నారే! నీవు మాట్లాడుతూంటే రత్నాలు కుప్పలుకుప్పలుగా కురుస్తోన్నాయి. ఆ రత్నాల వెలుగు, లోకాన్ని అంతా కప్పేస్తూ సూర్యుణ్ణి గూడా కనపడకుండా చేస్తోంది. ఈవెలుగూ చూడలేకుండా ఉన్నాను. (మఱల గన్నులు మూసికొని కొంతసేపటికి తెఱచి కన్నులు నులుముకొనుచూ) ఇప్పుడు ఏమీలేదే! నేను చూచిందంతా ఏమిటీ. అది నిజమేనా? పన్నా! ఛీ; ఛీ; పన్నా ఏమిటి? ఆపేరు చాలా అసహ్యంగా ఉంది. నీ తెగింపుకీ, నీ తెలివికీ, నీగుండె నిబ్బరానికీ, నీమంచిమంచి గొప్పలచ్చనాలకీ ఈ పేరేమిటి? నీముఖం అంతా రత్నాలే, నీఒళ్లంతా రత్నాలే, నీలచ్చనాలన్నీ రత్నాలే. కాబట్టి నిన్ను ఈవాళనుంచీ 'రత్నం' అని పిలుస్తా. రత్నం! వెలలేని రత్నం! సాటిలేని రత్నం! తళతళ లాడేరత్నం! ఎక్కడా దొరకనిరత్నం! నీవెలుగు, నీప్రభ లోకం ఉన్నంతకాలం నిలిచిపోతుందిలే.

పన్నా—జగ్గూ! నీవు అతిధోరణిలో పడిపోతూ ఉన్నావు. ఇట్టా అతిగా వాగటం మొదలెడితే నిజంగానే మతి చెడిపోతుంది. మతి చెడిపోయిందాక చేసే దేముంటుంది? ఇంక ఆలస్యంచేయటానికి వీలులేదు. నేచెప్పేది జాగ్రత్తగా విను. వింటున్నావా? (ఉదయసింహుని, పళ్లబుట్టలో బెట్టి, గాలి వచ్చేటట్టు, పిల్లవాడికి ఊపిరి ఆడేటట్టు, పైన పలచపలచగా ఆకులు కప్పును.) జాగ్రత్త సుమా! జగ్గూ! ఇటువంటి గొప్పపని చేసేటప్పుడు, ఎంత జాగ్రత్తగా ఉండాలి అనుకున్నావు! ఉన్న తెలివితేటలన్నీ ఉపయో

గించాలి. ఈ మనముగ్గురి చావుబ్రతుకులూ నీచేతులో ఉన్నాయి. బుట్ట తీసుకునిపోయేటప్పుడు, పళ్లబుట్ట తీసుకు పోతున్నట్టే నటించాలి. రాజకుమారుణ్ణి తీసుకుపోతున్నట్టు పిచ్చిపిచ్చి చూపులు చూశేవు సుమా? కొంప మునిగి పోతుంది. అయితే సెలవు ఎన్నాళ్లో పుచ్చుకున్నావు?

జగ్గు—మా అప్పని బావని చూసి వస్తానని చెప్పి పదిరోజులు సెలవు పుచ్చుకున్నాను.

పన్నా—మంచిది. సరి పోవచ్చులే! (బుట్టలోనున్న ఉదయుని జూచి) బాబూ! దేవుడు నీకు దీర్ఘాయు విచ్చుగాక, నీ తండ్రితాతలు ఎక్కిన సింహాసన మాక్రమించి, నీ అన్నను జంపిన ఈ రాక్షసుని తుదముట్టించి చిరకాలం సుఖంగా ధర్మరాజ్యం చెయ్యి. నిన్నెత్తిపెంచిన నీదాది తనకున్న దంతా నీకోసం అర్పించింది. ఈనాబలి గ్రహించి భగవం తుడు నీకు క్షేమము గూర్చుగాక.(అమరునివంక జూచుచు) నా ఈ రక్తంలోనుంచీ, ఈ మాంసములోనుంచీ, ఈయా వత్తు దేహంలోనుంచీ, ఈ ఆత్మలోనుంచీ పుట్టినవాడవు నీవు నేచేసిన పూర్వపుణ్యమంతా నీరూపంగా ఫలిం చింది నీదేశంకోసం, నీరాజ్యంకోసం నిన్ను బలి ఇస్తూన్నా, నా సాహసాన్ని క్షమించు. దేవతలుగూడ నన్ను మన్నిం తురు గాక. నీవు అంతరించినతరువాత, పిడుగుపడి కూలి పోయిన వృక్షంలాగ కూలిపోతాను. నాయనా! నా ముద్దులతండ్రీ! నిన్ను విడిచిపెట్టటానికి నామనసు ఎంత యమయాతన పడుతోంది? (లోపల లోపల నేడ్చును.)

**జగ్గు**—పన్నా! కాదు కాదు, రత్నం! అతన్ని విడిచిపెట్టకు. రాజుగారిసొమ్ము తిన్నవాళ్లంతా, ఏమీ చేయకుండా ఊరుకుంటే. నీవు మాత్రం ఇటువంటి కనీ విననటువంటి గొప్పబలి ఎందుకు ఇయ్యాలి?

**పన్నా**—రాజులసొమ్ము తినటమే కాకుండా, ఉదయుని, పాలిచ్చి ఎంతో ప్రేమతో పెంచాను గూడాను. నాకు ప్రాణంమీద, నాబిడ్డమీద ఎంత తీపి ఉన్నా, రాజుగారి ఉప్పూ పప్పూ తిన్నవిశ్వాసం వదలిపెట్టలేక పోతున్నాను. సామంతులు సాయంచేయలేక ద్రోహంచేస్తే చేయవచ్చు. కాని పన్నా మాత్రం ఈపట్టున సాయంచేయక మానదు. నన్నింకా బలవంతపెట్టి నిర్బంధించకు. నేను చెప్పినట్టు చెయ్యి

**జగ్గు**—అందఱూ విడిచిపెట్టిన రాజుకొడుకోసం, కన్న కొడుకును బలియిచ్చే తల్లులను ఇంతవఱకు చూడలేదు. నేను చేయగలిగిందల్లా ఏమిటంటే, నా కప్పగించినపని జాగ్రత్తగా చేయటం మాత్రమే. నేనేమయినా పొరబాటు చేస్తే నీవుచేసిన ఇంతపని అల్లా మట్టిలో కలిసిపోతుంది. (అని బుట్ట తీసికొని వెడలిపోవును. పన్నా కన్నీళ్లు తుడుచుకొని మనస్సులోనే దైవాన్ని ప్రార్థించుచూ మౌనము వహించి యుండును.)

(తెరపడును.)

# రెండవ అంకము

## రెండవరంగము.

[ఆ గడియలోనే తరువాత రెండుగంటలకు— పన్నా మౌనమువహించి కూర్చుండియుండును. అమరుడు నిద్రపోవుచుండును. దీపము తగ్గించి యుండును. వనవీరుడు చేత కత్తిపుచ్చుకొని తలుపుతోసి లోపల ప్రవేశించును. అతని వెంట నాయుధము ధరించి యిర్వురు దుండగీండ్రు ప్రవేశింతురు.]

**వనవీరుడు**—(కత్తినూరుచు పన్నావైపు చూచి) ఏడీ! రాజకుమారు డేడీ! (పన్నా నోరు మెదపకుండా, తనకుడిచేతి చూపుడువ్రేలితో మంచమువైపు చూపును. వనవీరుడటువైపు పరుగెత్తి నిద్రపోవుచున్న అమరునిగుండెలో, కత్తితో బొడుచును అమరుడు కిక్కురుమనకుండ ప్రాణాలు విడుచును పన్నా గుండెలు పగిలిపోవునటులు పెద్దకేక వేసి దుఃఖావేశముతో నేలబడి దొర్లును తరువాత గొంత తెలివి తెచ్చుకొని ఉదయా! ఉదయా! అని వాపోవును.)

**వనవీరుడు**—ఓసీ అమ్మా! నోరు మూసికో. (అనుచరుల వైపు తిరిగి) ఈచిన్నవెధవ చచ్చిపోయే యుంటాడు. అయినప్పటికీ ఒక్కమాటు పరీక్ష చేసి చూడండి. (అనుచరు లిర్వురు మంచముదగ్గరకు వెళ్లి, అమరుని గుండెలో, తిరిగి కత్తితో బొడుతురు అమరుని ఒడలుపట్టి చూతురు. నాడి పరీక్షింతురు)

**వనవీరుడు**—ఏమీ లేకుండా చచ్చిపోయినట్టేనా ?

**మొదటి భటుడు**—కాస్త లేకుండా ముమ్మాటికి చచ్చినట్టే.

**రెండవ భటుడు**—ఇంక ఆలోకంలోనే బతకటం. (పన్నా, శవముమీందబడి పెద్దపెట్టున నేడ్చును. దీపములో చము రు తగ్గిపోవును. వత్తి బాగుచేయకపోవుటచే దీపము మకమకలాడుచుండును.)

**వనవీరుడు**—(పన్నావైపు తిరిగి) ఓ అమ్మా! చెప్పేది విను. ఈ శవాన్ని యిప్పుడే తగులబెట్టవలెను. విక్రమజిత్తుశవము కాలుచున్న కాష్ఠముదగ్గర కీశవాన్ని గూడ దీసికొనిపోయి తగులబెట్టు. ఈ చిన్నశవాన్ని గూర్చి ఆడవాళ్లేమీ గోల చేయకుండా ఉండేటట్టు చూడు. వాళ్లిదివరకే చాల గోలచేసినారు. తగులబెట్టు ముందీ శవాన్ని. ఎవరికీ చూపింపవద్దు. ఇది తగులబడి పోయినతరువాత, నీకీ కోటలో పనియుండదు కనుక నీయింటికి నీవు పోవచ్చును. నేను చెప్పినపనులన్నీ, అక్షరాల జరిగేటట్టు నాభటులు కనిపెట్టి చూచెదరు.

**రెండవ భటుడు**—ఏలినవారి చిత్తానుసారమే జరుగుతుంది. (వనవీరుడు నిష్క్రమించును.)

**ఇదఱు భటులు**—(పన్నా నుద్దేశించి) నీ ఏడుపు కట్టిపెట్టి ఈశవాన్ని దీసుకొని మావెంట చితిదగ్గఱకు రా. (పన్నా అమరుని శవాన్ని యెత్తుకొని వారి ననుసరించి గవిదాటి వెడలును.)

(తెర పడును.)

# రెండవ అంకము

## మూడవ రంగము.

[కుంభాల్మరుకోటలో దుర్గాధికారి ఏకాంతమందిరము. ఆశాసా, అతనితల్లి కూర్చుండి చాల ఆత్రముతో నెదురు చూచుచుందురు. సాయంకాలము 5-గంటలు.]

ఆశాసా— పిల్లవానిని వెంటబెట్టుకొనివచ్చిన ఆ యువతి యేకాంతమున ముచ్చటింప నెంచుచుండునో?

యశోద— ఇప్పుడే తెలియగలదు. అదియేదో చాల ముఖ్యమైనవిషయమై యుండును.

(ఉదయుని వెంటనిడుకొని పన్నా ప్రవేశించును.)

పన్నా—(ఉదయుని ఆశాసా ముందుంచి) ఇదుగో మీ ప్రభువు, చిత్తూరురాణా ఉదయసింహుడు. ఈయనను ఆపదలనుండి తప్పించి రక్షించుడు. నే నీయనదాదిని. నా పేరు 'పన్నా' అంటారు.

ఆశాసా—(ఆశ్చర్యముతో) నీఅభిప్రాయ మేమి? ఉదయసింహుడు చనిపోలేదా? చిత్తూరులో నున్న మాప్రతినిధి, అతడు స్వర్గస్థుడైనటులు వ్రాసినాడే! తరువాత మేము వినినది కూడ నంతే. నేను, నాతల్లి, ఆ దుర్మరణము గూర్చి చాల విచార మొందినాము.

పన్నా—మీ మాటలు నాకెంతయు సంతసము గలిగించినవి. అతడు జీవించియున్నందులకు మీ కపరిమితమయిన ఆనందము కలిగియుండును. అవసరమైన మీప్రాణాన్నైనా అర్పించి ఈయన్ని రక్షిస్తారు అనుకుంటాను. ఈశచరణుడు, సింగరావు, కొఠారిచౌహాణుడు వ్రాసిన ఉత్తరములు పరిశీలింపుడు. ఈయన ఉదయసింహుడు అయినది కానిది మీకే తెలియును. ఇంకా ఈయన శరీరమందున్న పుట్టు మచ్చలు తక్కినలక్షణాలు చూడండి! వనవీరుడు చంపింది నా కుమారుణ్ణి. (ఉత్తరము లందిచ్చును)

ఆశాసా—(ఉత్తరములు చూచి) అయితే ఈపొరపా టెట్లా జరిగినది ?

పన్నా—అది పొరపాటు కాదు నాకుమారునకు ఉదయసింహునివేషం వైచితిని ఉదయసింహునకు నా కుమారుని వేషము వైచి, ఆయన్ని, నాప్రాణమిత్రుడు, కోటలో వంటవాడు అయిన జగ్గు కప్పగించితిని. ఆ పుణ్యపురుషుడు రాజకుమారుణ్ణి కోటలో నుంచి తప్పించినాడు నాపిల్ల వానిని జంపి దహించిన తరువాత, (దుఃఖ మాగక పొంగి పొరలివచ్చును) బేరీనదిలో ఏనుగులగుట్టవద్ద నున్న జగ్గును గలిసికొంటిని. నాటినుంచి నేటివఱకు, ఈ పదిరోజులు, ఈపిల్లవానిని వెంటబెట్టుకొని, ఎక్కడైనా సురక్షణ దొరకుతుందేమో నని, ఊరూరు తిరిగినాను. ఉత్తరాలన్నీ చదవండి, సంగతంతా వానిలో ఉంది. (ఆశాసా ఉత్తరములన్నియు బరిశీలించును.)

**యశోద**—(పన్నా నుద్దేశించి) నీరాజుకోసం నీవెంత త్యాగం చేశావు అంత సాహసం చేశేటప్పుడు నీ మాతృప్రేమ అడ్డుపడ లేదా ?

**పన్నా**—అమ్మా! అప్పుడొక పెద్ద అవస్థే తటస్థించింది. ఒక్క క్షణం మాత్రం చాల గందరగోళం పడ్డాను. ఉత్తరక్షణం లో నేను చెయవలసినకర్తవ్యం, ధర్మం విస్పష్టంగా కను పడ్డవి. నా పిల్లవానితండ్రి సంగరాణాకోసం ప్రాణా లర్పిం చారు. కాబట్టి ఆయనకొడుకు సంగరాణాకుమారుని ప్రాణాలు రక్షించటానికి చచ్చిపోవలసిందే అని అను కున్నాను. నావంటి దిక్కులేని ఆడది ఇంతపని చేసినప్పుడు ఈరాజకుమారుని ఇటుమీద ఈ దుర్గాధికారి రక్షించాలి అని అంటే తప్పౌంటుందా?

**ఆశాసా**—నాకు కూడా ఈయన్ని రక్షించాలి అని కుతూ హలం ఉంది గాని రక్షించలేను. నేనా, వీరుడను కాను. వనవీరు నెదిరించగల సైన్యాలా నాకు లేవు. ఈరాకు మారుని రక్షించుచున్నానని తెలిసినవెంటనే వనవీరుడు నన్ను చిత్రవధ చేయించగలడు. కనుక ఈయనను రక్షింప గల రాజపుత్రసామంతులవద్దకు తీసికొనిపో.

**పన్నా**—ఈయనయం దభిమానముగల రాజపుత్రులవద్దకు వెళ్లే వచ్చాను వారు తమకు సాధ్యంకాదని తెల్లమొగం వేశారు. మొట్టమొదట దేవలపట్నంలో ఉన్న సింగరావు వద్దకు తీసుకొని వెళ్లాను. ఆయన తనకొంప ఏమి మునిగి పోతుందో అని భయపడి, ఇంకొకచోటి కెక్కడికైనా తీసుకొని పొమ్మని బ్రతిమాలాడు. ఈరహస్యం ఎవరికీ

తెలియనీయనని చెప్పి, ఎందుకైనా అక్కఱకు వస్తుందని కొంత డబ్బు కూడా ఇచ్చాడు తరువాత చిత్తూరు రాజ కుటుంబంతో దగ్గరబంధుత్వం గల రావులువద్దకు వెళ్లాను. ఆయన కూడా సింగరావు అప్పచెప్పినపాఠమే అప్పచెప్పి దారిబత్తానికని కొంత డబ్బిచ్చి పంపించాడు. తరువాత ఇక్కడికి రావాలని ఏడూరుమీదుగా ఆరావళీపర్వతాలు చేరాను. అక్కడ భిల్లులు రాజపుత్రసామంతులకు సాధ్యం కాని ఉదయసింహుని సంరక్షణానికి పూనుకుంటామని చెప్పారు. కాని చిత్తూరుమహారాణా భిల్లులసంరక్షణలో ఉండటం అంత భావ్యంగాదని ఎంచి, సంగరాణాయందు మిక్కిలి గౌరవం భక్తిగల మీరు ఈయన్ని తప్పక రక్షిస్తారనే గట్టి నమ్మకంతో ఇక్కడికి వచ్చాను.

**ఆశాసా**—ఈయనతో రక్తసంబంధంగల రాజపుత్రసామంతులే భయపడితే, సాత్వికస్వభావంగల నావంటి జైను డేమిచేయగలడు. ఈయన నిప్పుడు చేరదీయుటంటే స్వయముగా మృత్యుదేవతను, ఆహ్వానించుట అన్నమాట గదా! కాబట్టి ఇంకొకచోటికి దీసికొని పో.

**పన్నా**—(ఆశాసాపాదములమీద పడి) ఈ చిన్నవాడని, ఈ మీస్వామిపుత్రుణ్ణి రక్షించండి, రక్షించండి, నా కుమారుని యజ్ఞము నిష్ఫలం చేయకండి ఈ మీ వైభవమంతా ఈయనతండ్రివలన మీకు సంక్రమించినదే. దానికి బదులుగా ఆయన కొడుకువచ్చి మిమ్ము శరణుకోరుతూంటే రక్షింపవద్దా? జీవకారుణ్యసిద్ధాంతానికి కట్టుబడిన

జైనులు కారా మీరు? ఈయన్ని నిరాకరించి మృత్యు ముఖంలోకి తోయకండి.

**ఆశాసా**—నాకు రక్షింపగలసామర్థ్యము లేదు. ఈయనను దీసికొని పో. నేను చాల దుర్బలుడను. బలహీనులకు, పౌరుష మెట్లులుండును?

**పన్నా**— (రాజకుమారుని యశోద ముందుంచి) అమ్మా! ఈ తల్లీ తండ్రీ లేని పిల్లవాణ్ణి రక్షించు. పిల్లల గన్నతల్లివి గనుక నీకు పిల్లలమీద ప్రేమ ఉంటుంది. మిమ్ము శరణు గోరిన ఈ పసిబాలుని వదలివేయవద్దు. (ఉదయుడు యశోదఒడిలో జేరును.) అమ్మా! చూడు నిన్ను పట్టుకొని ఎలా వదలకుండా ఉన్నాడో?

**యశోద**—(పిల్లవానిని జేతులలోనికి దీసికొని) అబ్బాయీ! ఈయనను మనము రక్షించాలి. ప్రాణదానము చేయుట చాల గొప్పధర్మము. అదీకాక నీ ప్రభుపుకుమారుడు. ఏమాత్రము రాజభక్తి అనేది ఉన్నా విధిగా రక్షించాలి. అంతేకాకుండా ప్రాణాపాయస్థితిలోనుండి నిన్ను శరణు గోరుచున్నాడు ఈ చిన్నవాడ. భక్తి, ఆపదలను, కష్టాలను సరకుసేయనీయక, సాహసము చేయుమని ప్రేరేపించును రాజకుటుంబమువలన అతిస్వల్పముగా ఉపకారము పొందిన ఈ అబల, అనాధ, తనకున్నదంతా, తన ఒక్కకొడుకును గూడా రాజకుమారునికోసము అర్పించివేసినప్పుడు, సంగరాణావల్ల అంత ఉపకారము పొందిన నీవు ప్రత్యుపకారముగానైనా ఈయన్ని రక్షించుట కనీసమైన ధర్మము గాదా? కాబట్టి రాజకుమారుని

రక్షించటానికైనా సిద్ధపడు, లేదా, నీతల్లి యిచ్చేశాపము పొందటానికైనా సిద్ధపడు.

**ఆశాసా**—అమ్మా! నామాట గూడా విను. మన మీయనను చేరదీసినటులు వినినంతనే వనవీరుడు, తనసైన్యాలన్నీ వెంటబెట్టుకొని వచ్చి మనలనందఱినీ ఈ రాజకుమారునితో గూడ చంపివేయగలడు. కనుక ఈ వెఱ్ఱి ఆలోచన వలన **లాభ** మేముంటుంది ?

**పన్నా**—వనవీరుడికి ఈ కుమారరాజు బ్రతికి ఉన్నట్లే తెలియదు. చచ్చిపోయినాడనే అతనినమ్మకం. అంతఃపురస్త్రీలకు గూడా ఈయన బ్రతికి ఉన్నట్లు తెలియదు. వారందఱు ఈయన చచ్చిపోయినట్టు, దహనంగూడా అయిపోయినట్టు భ్రమపడుతున్నారు. మీరిద్దఱు, నేను, జగ్గు, కోఠారి చౌహాణుడు, ఈశచరణుడు, సింగరావు, ఫిల్లనాధుడు, ఈ ఎనమండుగురికి తప్ప, ఈయన బ్రతికి ఉన్నట్టు బ్రహ్మకైనా తెలియదు అనుకూలమయినకాలం రాకముందు వీరిలో ఒక్కరు గూడా ఈరహస్యం బయటికి పొక్కనీరు. కనుక ఈయనకు జైనబాలుని వేషంవేసి సంరక్షించేటట్లైతే మీకేమీ ఇబ్బంది కలుగదు. మంచికాలం వచ్చినప్పుడు మన మీయన పుట్టుపూర్వోత్తరాలు బయట పెడదాం అంతవఱకు ఎవరికీ ఏమీ అనుమానం కలుగదు. కాబట్టి ఈయన్ని రక్షింపుడని మఱీమఱీ వేడుకొంటున్నాను.

**యశోద**—అబ్బాయీ! ఈమె చెప్పింది యుక్తియుక్తంగా ఉంది. ఈయన్ని, నీచచ్చిపోయిన చెల్లెలికొడుకని చెప్పి

రక్షించు. వెంటనే ఈయనకు జైనబాలునివేషం వేయించి అందరికీ నీ మేనల్లుడని చూపించు. తరువాత అవసరమయినప్పుడు రహస్యం బయటపెట్టవచ్చు. ఈరహస్యం ఈలోపలనే బయటపడి మనమంతా నాశనమైపోవటమే తటస్థిస్తే, రాజసేవలో చచ్చిపోయేభాగ్యం కలిగిందని సంతోషిస్తాము స్వామిభక్తి, అపాయాలని లెక్కచేయదు. పైగా పరిహాసం చేస్తుంది. ఈయన నీకు ప్రభువు, ప్రభుపుత్రుడు. కాబట్టి పుణ్యం కట్టుకో. భగవదనుగ్రహంవల్ల మేలు గలుగుతుంది.

ఆశాసా—అమ్మా! నీవు చెప్పినప్రకారమే కానీ. నేను రాచకార్యములు చక్కబెట్టుకొందును. (ఆశాసా నిష్క్రమించును. యశోద యొక నమ్మకమయిన దాసీని బిలిచి, పిల్లవానికి జైనవేషము వైచి తెసికొనిరమ్మని చెప్పి బాలునిచ్చి పంపించును.)

యశోద—(పన్నా నుద్దేశించి) ఈ అబ్బాయిని కనిపెట్టుకొని ఇచ్చటనే యుందువు కదా?

పన్నా—తల్లీ! ఉండటానికి వీలులేదు. జైనగృహస్థు ఇంట్లో రాజపుత్రస్త్రీ నైన నేను ఉంటే, అనుమానం కలుగుతుంది. దానివలన రహస్యంగూడా బయటపడితే పడవచ్చు. ఉదయసింహునిముఖం జాగ్రత్తగా చూచేవాళ్లకి శిశోదయ వీరలక్షణాలు కనపడతాయి గాని సాత్వికజైనలక్షణాలు కనపడవు.

యశోద—నేను మాత్రము ఆపిల్లవాని ముఖములోనున్న వీరలక్షణాలు కనిపెట్టలేకుండా ఉన్నాను. ఈయన్ని చూచి అందఱు జైనులపిల్లవాడే అని అనుకొందురు.

పన్నా—అమ్మా! జాతిలక్షణాలు బయటపడకుండా ఉంటాయా?

యశోద—అలవాట్లవల్ల, పెంపకంవల్ల గూడ స్వభావము తారుమారు గాగలదు. ఈజైనులయొక్క పూర్వీకులు గూడా ఒకప్పుడు రక్తపిపాసగల వీరులే అయియుందురు. ఇప్పుడో నెత్తురు పేరు చెప్పిన మూర్ఛ పోవుదురు.

పన్నా—ఉదయుడు గూడా అట్లా తయారుగావాలని నా ఉద్దేశం కాదు. తరువాత ఆయన యుద్ధంచేసి, రాజ్యం తిరిగీ సంపాదించాలి, మహమ్మదీయుల నీ దేశములోనుంచి తరిమివెయ్యాలి గూడాను. కాబట్టి, ఆయన్ని పిరికిగుండె గలవాన్నిగా జేయగూడదు.

యశోద—నీవు చెప్పినది యుక్తముగనే యున్నది రాజు, తన రాజధర్మము నెఱవేర్చవలసినదే! అడుగో ఆయన వచ్చుచున్నాడు. (ముండిత శిరస్సుతో, జైనవేషముతో, ఉదయుడు ప్రవేశించును.) చూడు! శాంత ముట్టిపడు చున్న జైనబాలునివలె లేడూ!

పన్నా—ఔను. రాజపుత్రచక్రవర్తికి ఉండకూడనంత జైనం వచ్చింది. కాని ఇప్పుడు అది ఉంటేనే చాల మంచిది. నాకు గూడా ఈయన్ని గుర్తుపట్టటం చాలా కష్టంగా

ఉంది ఇక మీ అందటికీ సెలవుతీసుకొని చిత్తూరుకు వెళ్లి పోతాను. అక్కడ కొంతారిచౌహాణుని కొలువులో చేరి, జగ్గుద్వారా కోటసమాచారాలు తెలుసుకుంటూ ఉంటాను. అవసరమైన వర్తమానాలు నమ్మకంగల మనుష్యుల ద్వారా తెలియచేస్తూ ఈ మాచిన్నదొర క్షేమసమాచారాలు, ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ ఉంటాను. అమ్మా! మీరు చేసిన ఉపకారం ఇంతని చెప్పలేను. రాజకుమారునిప్రాణం మీరు నిలబెట్టారు.

యశోద—మేముగా కీయనను బ్రతికించినది, నీవు. ఈపిల్లవానికి వచ్చినయిబ్బంది యేమీ లేదు నీవు దిగులు పడవద్దు. నేటినుండి ఈయన నా మనుమడు కాగలడు.

పన్నా—అమ్మా! నీకు అనేక నమస్కారాలు. నీమాటలు నాకు అమృతంలాగా ఉన్నాయి.

యశోద—సంగరాణా తనకు జేసిన మహోపకారాన్ని, విక్రమజిత్తు చూపిన అభిమానాన్ని మఱచి, వనవీరుడు, విక్రమజిత్తును జంపి ఉదయసింహుని గూడ జంప యత్నించుట చూడ నాకు చిత్రముగా నున్నది.

పన్నా—దుర్జనులలక్షణ మంతే. వారు పాములవలె, పాలు తాగి, విషము కక్కుతారు; సజ్జనులో సూర్యునివలె, ఉప్పునీళ్లిచ్చినవారికైనా మంచి నీరిచ్చెదరు.

యశోద—నిజము, ముమ్మాటికి నిజము అయితే, మీవాళ్లతో, నీకొడుకేమైనాడని చెప్పదలచితివి.

పన్నా—అతడు, కొండల్లో తిరుగుతూంటే పాముకఱచి చచ్చి పోయినాడని, నాచేతులారా నేనే దహించానని చెప్పుతాను. అప్పుడు నా ముద్దులతండ్రిని స్మరించుకొని నా యిష్టం వచ్చినంతగా ఏడవటానికి వీలు కలుగుతుంది. ఇప్పటిదాకా ఈ దుఃఖసముద్రాన్ని ఆపి ఉంచాను. అమరుడి దేహం తగులబడుతూ ఉంటే నాఒళ్లంతా తగులబడి పోయింది. 'ఆత్మ ఆత్మలో గలిసినది. పంచభూతములు పంచభూతములలో లీనమైనవి' అని పురోహితుడు మంత్రాలు చదివాడు. నేను చూస్తూ ఉండగానే, అతని దేహంలో ఉన్న మట్టి మట్టిలో కలిసిపోయింది; గాలి గాలిలో సర్దుకుంది, నిప్పు నిప్పులో లయమై పోయింది, నీరు ఆవిరై ఎగిరిపోయింది ఇక అమరుడు అనేపదార్థం లేకుండా పోయింది. ఆకాశమంతా ఎఱ్ఱనిమేఘాలతో నిండిపోయింది, చంద్రుడు ఆ భయంకరదృశ్యాన్ని చూడలేక దాక్కున్నట్టుగా గనుపడనే లేడు. అక్కడక్కడ మినుకు మినుకుమంటూ ఉన్న చుక్కలు ఆదౌర్జన్యాన్ని సహించలేక వణకిపోయినాయి...పదినెలలు, ఎన్నో కష్టాలుపడి మోశాను, ఆజేళ్లు పడరానిపాట్లల్లా పడి పెంచాను. తుదకు నాతండ్రి నాదు కాకుండా పోయినాడు. ఇప్పుడు నాదగ్గర కెవరు వస్తారు; తేనెలొలికే ముద్దుముద్దుపలుకులు లెవరు పలుకుతారు; రాజపుత్రకుమారులకు సహజమయిన వీరాలాపాలు ఎవరు ఆలపిస్తారు. ఇప్పుడు నన్ను 'అమ్మా' అని

పిలిచేవాళ్లు ఎవళ్లూ లేరు గదా! నే నెవరిని దగ్గఱకు తీయను. ఎవరిని ముద్దాడను. ఎవరిపిల్లలను జూచినా నాపిల్లవాణ్ణే జూచినట్టు ఉంటుందా? చచ్చేదాకా, ఇట్టా ఒంటరిగా, దిక్కూ మొక్కూ లేకుండా, చచ్చిపోతూ ఉంటే గొంతుకలో నీళ్లుపోసేవాళ్లైనా ఎవళ్లూ లేకుండా, 'చచ్చిపోయిం'దని ఆవురుమని ఏడ్చేవాళ్లైనా ఎవళ్లూ లేకుండా, ఎండి మోడై పోయిన చెట్టులాగ, ఱెక్కలుతీసిన పక్షిలాగ, బతకాలె నాయనా! నా ముద్దులయ్యా! నన్నెంత నిర్భాగ్యురాలిని జేసిపోయావు. (ఏడ్చును.)

యశోద—(తనలో) రాజపుత్రస్త్రీకి సహజమయిన సాహసంతో, రాజభక్తితో, ఆవేశంతో, కొడుకును జంపుకున్నా, కన్నతల్లి గనుక కడుపు తరుక్కుపోయేటట్టు ఏడ్చుచున్నది. (ప్రకాశముగా) పన్నా! పాపము, నీకు కడుపంత మండిపోవుచున్నదో కదా! నీకొడుకునే ఉదయుడని యెట్లు చెప్పగలిగితివి? అతన్ని, నీవు నీయెదుట కళ్లు పెట్టుకొని చూచుచుండగా జంపుచున్నప్పుడు ఎటులు భరించితివి?

పన్నా—మాటలాడలేక మంచంపైపు చేతితో చూపించాను. చంపుతూ ఉండగా, నాకు దుఃఖము మీాదు మిక్కిలి అయిపోయి కొయ్యబాఱిపోయినాను. తరువాత నేను పెద్దపెట్టున ఏడ్చినా, సనవీసుడు, అతనినౌకర్లు, రాజకుమారుడి కోసమే ఏడుస్తున్నాను, అనుకున్నారు, కాని వారికేమీా అనుమానం కలుగలేదు. ఈ రాజకుమారుని రక్షించటం

కోసం, కళ్లఎదుట తగులబడి పోతూఉన్న కన్నకొడుకు దుఃఖాన్ని దిగమ్రింగి వెంటనే ఏనుగులగుట్టకు పరుగెత్తాను. అప్పుడు నేనెంత బాధపడ్డానో భగవంతునకే ఎఱుక. ఏం అవస్థ పడ్డా, నాకప్పగించిన రాజకుమారుణ్ణి రక్షించగలిగాను నాకదే చాలు. ఆ సేవకధర్మంకోసమే ప్రాణాన్నే బలి ఇచ్చాడు నా ముద్దులనాయన అమరుడు. నాయనా! అమరా! నిన్ను విడిచి నేను ఎట్లా బ్రతకగలను? జగ్గు అన్నట్లుగా, నీతల్లి కటికగుండెదని అనుకోకు నాయనా! తండ్రీ! నీయందు నాకు ప్రేమ లేకపోలేదు. అమితంగా గలదు. తక్కిన రాజపుత్రపిల్లలు, అరువై ఏళ్ల వయస్సు వచ్చింతరువాత ఎంత గొప్పవారలైనారో, ఆరేళ్లనాడే నీవు అంతపేరుపడవు గావాలి అని అపేక్షించాను. దేశాన్ని, రాజును, నీవు ప్రాణం అర్పించి రక్షించావు. తరతరాల వారు, నిన్ను, నీతల్లిని, ప్రభువులకోసం చెప్పినట్టి పుణ్యాత్ములని ఎంతో గౌరవంతో ప్రశంసిస్తారు. తండ్రీ! నా మంచిఉద్దేశం గ్రహించి మన్నించు. (జాలిపుట్టునటు లేడ్చును.

యశోద—గడచిపోయినదేమో గడచిపోయినది ఏడిస్తే ఏమి లాభము? ఏమువబోను చితిమీద పడుకోపెట్టిన అమరుణ్ణి జూచి అంతఃపురస్త్రీలు గుర్తుపట్టలేదా?

పన్నా—లేదు, వారిని చితిదగ్గఱకు రానీయలేదు. దూరాన నుంచుని చూచారువారు. అగ్నిహోత్రునకు శవము ఆహుతియై పోతూ ఉండగా నేను ఒక్కత్తైనే సమీపంలో నిలు

చుండి, 'ఉదయా!' 'ఉదయా!' అని పెద్దపెట్టున ఏడ్చాను. విక్రమజిత్తుకోసం, ఏడిచి, ఏడిచీ అలసిపోయిన అంతఃపుర స్త్రీలకు, ఉదయునికోసంగూడా ఏడవటానికి ఓపిక లేక పోయింది. విక్రమజిత్తు చచ్చిపోయిందరువాత ఉదయుడు చచ్చిపోవటంలో వాళ్లకేమీ విపరీతంగా తోచలేదు. అదీ గాక, ఉదయునితల్లి ఇదివరకే చచ్చిపోయింది. తక్కినవాళ్లెవళ్లకీ అతనిమీద అంత ప్రేమలేదు. కాబట్టి ఎవరూ వనవీరుని ఆజ్ఞనతిక్రమించి చితిదగ్గరకు రాలేదు. అప్పుడు వెలుతురు అంతగా లేదు. వేషంలోను, ఆకారంలోను, ఒడ్డూపొడుగులోను, అన్నిలక్షణాల్లోను, అమరుడు, ఉదయుడూ ఒకమాదిరిగానే ఉంటారు గనుక ఎవరికీ అనుమానమే కల్గలేదు.

**యశోద**—పన్నా! నీవు నిజంగా రత్నానివి, స్త్రీరత్నానివి, మాతృరత్నానివి; రత్నప్రభవలె, నీప్రభ గూడా లోకములో, సర్వకాలము వెలుగుచూ జనులహృదయాలని ఆకర్షింపగలదు. ఇదిగో, ఇది తీసికో. (అని యొకరత్నహారము, ఒక మొహరీలసంచీ అందియ్యబోవును.)

**పన్నా**—అమ్మా! ఎవరికోసం అయితే ఇదివరకు డబ్బు అపేక్షించానో, ఆ రాజకుమారుణ్ణి నీకు అప్పగించాను. కనుక ఇంక నాకు డబ్బుతో పనిలేదు. ఈహారాన్ని, ఈసంచీని ఉదయసింహమహారాణాకొరకు వినియోగించండి.

**యశోద**—సరే! నేను అనుకున్నంతా జరిగినది. ఇవే కాకుండ, నాసంపద యావత్తు, ఉదయసింహునికొరకు వినియో

గించెదను. మంచికాలము వచ్చేదాక, ఈ ఉదయసింహు నకు, 'ఉదయచందు' అను పేరుపెట్టుదము.

పన్నా — నేనింక సెలవు తీసుకువెళతాను. నాయనా! ఉదయా! మీ అమ్మమ్మదగ్గఱ సుఖంగా ఉండు. మేము చెప్పేదాకా నీపేరు 'ఉదయచందు' అని చెప్పుకో. అట్లాగైతే ఆ రాకాసి వనవీరుడు నీజోలికి రాడు తండ్రీ! నీకేం భయంలేదు. నేను వెళ్ళిరానా? అప్పుడప్పుడు వచ్చి చూచిపోతూ ఉంటాలే! దిగులుపడబోకు. (కళ్లవెంట నీరు కాలువలై కారుచుండ, ఉదయుని చాలసేపు ముద్దాడి, విడిచిపెట్టలేక విడిచిపెట్టలేక, ఎట్టకేల కెట్టులో విడిచి వెడలిపోవును)

(తెర పడును.)

# రత్నప్రభ

## మూడవ అంకము

### మొదటిరంగము.

[ఏడు సంవత్సరములు గడచినతరువాత నొకనాడు మధ్యాహ్నము 1-0-గంట సమయమున చిత్తూరు రాజమందిరమున నొకగదిలో, మాలోజీ, సోలంకీ, వనవీరునికొఱ కెదురుచూచుచు మాటలాడుచుందురు.]

**మాలోజీ**—సోలంకీ! స్థితిగతు లిట్టులు తారుమారైనవని నాకు జాలవిచారము గలుగుచున్నది. మనమిర్వురము తప్ప మిగిలిన రాజపుత్రసామంతులందఱు మహారాణాను వదలి వేసినారు. కాంజీ, విప్లవకారులకు నాయకత్వము వహించినాడు. ఏడేండ్లకు బూర్వ మీ పెద్దమనిషియే, 'మహారాణా పద మలంకరించి మమ్ము రక్షింపవలసిన'దని వనవీరుని కాళ్ల వేళ్ల బడి బ్రతిమాలినాడు. మహారాణా, గౌరవపురస్సరముగా దూనా పంప, కాంజీ దానిని దిరుగగొట్టుటయే కాక, 'బప్పరావుల సక్రమసంతతివారి చేతులనుండి దీనిని గ్రహించుట గౌరవప్రదమే యైనను, సీతలసేనీపుత్రుని

చేతులనుండి గ్రహించుట అగౌరవప్రదమే' అని తూలనాడి, కుంభాల్మరు కోటలోనున్న ఉదయసింహునితో గలిసి తిరుగుబాటు లేవతీసినాడు. మనమిద్దఱము తప్ప తక్కిన సంస్థానాధీశ్వరు లందఱూ, అన్నమాట నిలుపుకొనలేక వారితో గలిసినారు. ఈ రాజద్రోహులందఱు కుంభాల్మరుకోటలో సమావేశమయి, ఉదయసింహునినొసట రాజతిలక ముంచినారు. తరువాత శోణఘురురాయని పుత్రిక నిచ్చి వివాహము గావించినారు. ఆ పెళ్లికి పెద్దలంతా ఎట్లంగీకరించిరో నాకర్థము గాకున్నది.

**సోలంకీ**—దానికి సమాధానము చెప్పుట సులభమే ? ఆశాసా, కొఠారిచౌహానునితో, 'నీ వుత్తమరాజపుత్రవంశజుడవు, ఈ ఉదయసింహుని గుర్తించి, రక్షింప నీకంటె సమర్థుడు లేడు.' అని కొనియాడినాడట. దానిచే నుప్పొంగి పోయి, చౌహానుడు, ఉదయసింహునితో గలిసి ఒక్కకంచములోనే భోజనము చేసినాడట. అప్పు డందఱు, ఉదయసింహుని సంగరాణాకుమారునిగ నంగీకరించిరట. తరతరాలనుంచి వెలిబెట్టబడిన కులానికి జెందిన శోణఘురురాయడు బప్పరావుల వంశీయులతో సంబంధము కలుపుకొనవలయునను కుతూహలముతో ఉదయసింహునకు దనకుమార్తె నిచ్చి వివాహము గావించెదనని పలికెనట. తరువాత వనవీరమహారాణా కుమార్తెకు బంపు సారెను, ఆ జగడగొండిసామంతు లడ్డుగొట్టి, వెంటనున్న పరికిభటులను బెదరించి, ధనకనకవస్తువాహనాదులను వశము చేసికొనిరి. ఆద్రవ్యముతోనే ఉదయసింహుని వివాహము

మహావైభవముగా జరిపిరి. మనము తప్ప మిగిలిన రాజపుత్రవీరులందఱు నాదంపతులకు నిజవైభవానుసారముగ కట్నములు చదివించిరి.

**మాలోజీ.**—ఇప్పు డాసామంతులు పదివేలగుఱ్ఱపుదళము సిద్ధపఱచి చిత్తూరుకోటను ముట్టడించి, తాము స్వయముగా మహారాణాపదమున నిలిపిన వనవీరుని పదభ్రష్టుని గావింప సంకల్పించుచున్నారు. ఈ దొరలప్రవృత్తి చాల చిత్రమయినది. అంతకన్న విచిత్రమయినది వారి ధర్మపద్ధతి. ఈ గందరగోళానికంతా, ఆ పన్నాయే కదా కారకురాలు. ఆమె కనుక ఉదయుని గాపాడకపోయినట్లైతే, ఈ విప్లవాలకు, ఈ తిరుగుబాట్లకు, ఆధారమే లేకపోయెడిది.

**సోలంకీ**—ఆమె మనకు, అపకారమే గావించినప్పటికి, చాల ప్రసంశనీయమైనపనియే చేసినది. ఈసిగ్గులేని సామంతులవలె, ఆమె వనవీరుని రాజ్యము గ్రహింపుమని ఆహ్వానింపను లేదు, భక్తివిశ్వాసములతో సేవించెదనని ప్రమాణము చేయనూ లేదు, నమ్మించి గొంతుక కోయనూ లేదు. ఆమె నిరుపమాన నిష్కపట స్వామిభక్తికి, ఈకృతఘ్నుల విశ్వాసఘాతుకుల ద్రోహబుద్ధికి, పోలిక యెక్కడిది? తన ఒక్కకొడుకునూ బలియిచ్చి, ప్రాణాపాయము గూడ సరకు సేయక, ఊరూరు తిరిగి, పడరానిపాట్లు పడి, రాజకుమారుని సంరక్షించిన పన్నావంటి ధీరురాలు, ఉత్తమురాలు మఱియొకతె ఎచ్చటనైన గానుపించునా?

**మాలోజీ**—వీరాగ్రేసరులయిన రాజపుత్రసామంతులుసాధింపలేనిపని సాతీకుడైన జైనుడు సాధించినాడే? అతడు,

ఉదయుని తన మేనల్లుడని చెప్పి కాపాడి సమయ మను కూలమైనప్పుడు, అతని పుట్టుపూర్వోత్తరాలు బయట పెట్టినాడు. ఇంతకు దైవమే, పన్నా రూపముగా వచ్చి మన కొంప దీసినది. పట్టాభిషేకదినమునందే మన మీవిష యము సవిమర్శముగా విచారింపవలసినది. కాని యింత మోసము జరుగునని యెవ రూహించిరి? ఆదానీముండ ఉదయునికోస మెంతజాలిగా ఏడ్చినది. అంతఃపురస్త్రీలు కూడ అతడు ఉదయుడు గాడని గ్రహింపలేక పోయి నారు. పన్నాకొడుకు విక్రమజిత్తుతోబాటు రాజగౌరవ ములతో దహనమయినాడు. ఎంత ద్రోహము? ఎంత దురాగతము? ఇంత మోసముచేసిన పన్నాకు మరణశిక్ష విధించినా పాపము లేదు. ఈమాటు మన కందినప్పుడు, అందక ఎక్కడికి పోవునులే, దాని కంతటి ప్రాయశ్చిత్తము గావింపవలసినదే? సింగరావునకు, ఈశచరణునకు, చౌహాను నకు, ఈరహస్యము మొదటినుండియు దెలియును. కాని వారు మన కది తెలియనీయకుండ దాచిపెట్టినారు.

**సోలంకీ**—వీరి పూర్వోత్తరాలు కొంతవఱకు నే నెఱుగు దును. వీరందఱు నేదో యొకవిధముగా, చిత్తూరు రాజ కుటుంబమువలన నుపకారము పొందినవారే. అందుచే నుదయునియందు దమకున్న పక్షపాతము వెలిపుచ్చిరి. కాని, కాంజీ, భాగోరు, శోణఘురురావు ప్రభృతులు తాము స్వయముగ బలవంతపెట్టి రాణాచేసిన వనవీరుని ద్రోహబుద్ధితో వదలివెళ్లుటయే, ఆశ్చర్యకరముగ నున్నది.

అరుగో మహారాణావారు విజయము చేయుచున్నారు.

(వనవీరుడు ప్రవేశించును.)

వనవీరుడు—మిత్రులారా! మన మీ తిరుగుబాటుదారులను వెంటనే అణచివేయవలయును. అందుకొఱకే మిమ్ము పిలిపించినాను. ఇప్పుడు అయిదువేల గుఱ్ఱపుదళము సిద్ధముగ నున్నది. ఈసైన్యము వెంటబెట్టుకొని పోయి, పదివేల అశ్వికబలము సమకూర్చవలెనని కలగనుచున్న సామంతులపై నకస్మాత్తుగా బడి వారిని నిర్మూలము చేయవలయును. దానితో వారికి బుద్ధి వచ్చి యిటువంటి ద్రోహమును మఱల దలపెట్టకుందురు. విక్రమజిత్తు రోజులలోవలె, నాప్రభుత్వములో వారే ఆటలాడిన నా ఆటలు సాగవని తెలియవలయును. మాలోజీ! నీకు కాంజీ జటావంతుల సంస్థానములు సంక్రమింప చేయుదును. సోలంకీ! నీకు కొఠారి, బైడల, శోణఘుర రాజ్యముల నిచ్చెదను. మిగిలిన వారి రాజ్యములు చిత్తూరు రాజ్యములో గలిపెదను.

మాలోజీ—రాణావారి ఈ యసదృశదాతృత్వమున కెంతయేని కృతజ్ఞుడను.

సోలంకీ—మహాప్రభూ! నాకృతజ్ఞత, మాటలలో ప్రకటింపలేక పోవుచున్నాను.

వనవీరుడు—మిత్రులారా! ఇది ఆరంభసత్కారమని భావింపుడు. నేను చెప్పినపని మాత్రము జాగ్రత్తగా మెలగి సాధింపుడు. ఆపైన మీ కెంత సత్కారము లభించునో మీకే విశదము గాగలదు.

**మాలోజీ, సోలంకీ**—మా బొందిలో ప్రాణము లుండునంత వఱకు శత్రువులను నిర్మూలము చేయగలమని ప్రమాణము చేయుచున్నాము.

**వనవీరుడు**—మీ స్వామిభక్తి విషయములో నాకెట్టి సంశయము లేదు. మీకు మేలు చేకూరు గాక. ఈదుర్గ సంరక్షణకు గావలసిన యేర్పాటులన్నియు గావించి, దేశములో మనకు పలుకుబడిగల ప్రాంతములనుండి పదివేల గుఱ్ఱపుదళమును బోగుచేసికొని వెంటనే వచ్చి మిమ్ము కలిసికొందును. ఈలోపల మీరు మన వైరివర్గమును రూపుమాపుడు. ఇంక మీ రాలస్యముచేయక శీఘ్రముగా బయలుదేరుడు. విజయము సాధింపుడు. (మాలోజీ, సోలంకీ వెడలిపోవుదురు. ధనమల్లు ప్రవేశించి ఆసీనుడగును.)

**వనవీరుడు**—ధనమల్లూ! దుర్గము సరియైనస్థితిలో నున్నదా?

**ధనమల్లు**—దుర్గము దివ్యమయినస్థితిలో నున్నది. సామంతుల సైన్యములన్నియు గలిసివచ్చినను, దుర్గమును స్వాధీనము చేసికొనజాలవు.

**వనవీరుడు**—సరే మంచిది అసలు విప్లవసైన్యము లింత దూరము రాగలవా? ఇప్పుడే మాలోజీని, సోలంకీని, అయిదువేల గుఱ్ఱపుదళము నిచ్చి విప్లవసైన్యములను జెండాడుడని పంపినాను. మనవారికి దప్పక జయము గలుగును. అయినను జయాపజయములు దైవాధీనములు

గనుక, వారికి వారములోపల విప్లవకారులు లోబడక పోయినచో నేను పదివేలగుఱ్ఱపుదళముతో వెడలి వారిని దప్పక జయించి వచ్చెదను.

(ద్వారపాలుడు ప్రవేశించి ఆస్థానదైవజ్ఞుడు వచ్చినాడని తెలుపును. అతనిని గొనిరమ్మని వనవీరు డాజ్ఞాపించును.)

**వనవీరుడు**—ధనమల్లూ! ఈసిద్ధాంతి ఫలములు తు, చ, తప్పకుండ జెప్పగలడని విని పిలిపించినాను. ఇటువంటి సందిగ్ధసమయములలో మన కెంత బలము, ధైర్యము, ఉన్నను, భవిష్యత్తు గూర్చి తెలిసికొనుట మంచిది కదా! అతనికి నా జాతకము, ఉదయసింహుని జాతకము పంపి, కొన్ని ప్రశ్నలిచ్చి వానికి సమాధానము లాలోచించు కొని రమ్మని వర్తమానము పంపినాను. కొంచెమాగి అతడు చెప్పునది వినుము.

(దైవజ్ఞుడు ప్రవేశించి ఆసీనుడగును.)

**వనవీరుడు**—(సిద్ధాంతి నుద్దేశించి) సమాధానములు సిద్ధముగా నున్నవా?

**సిద్ధాంతి**—చిత్తము. మహాప్రభూ!

మొదటిప్రశ్న: సామంతులు దౌర్జన్యముగా గోటలో ప్రవేశింప గలరా?

సమాధానము: దౌర్జన్యముగా సామంతులు గోటలో ప్రవేశింపలేరు.

రెండవప్రశ్న: ఉదయసింహు డింకెంతకాలము జీవించును?

సమాధానము: అతడు రాజ్యము గోలుపోయి చాల కాల మూరు పేరు లేకుండ జీవించును.

మూడవప్రశ్న: శ్రీవారి కిప్పట్ల ప్రాణాపాయ మున్న దా?

సమాధానము: ఇంకా ముప్పదిసంవత్సరములవఱకు ప్రాణాపాయము లేదు.

**వనవీరుడు**—ఈ ఫలములన్నియు సరిగా జరుగునని నమ్మక మున్నదా?

**సిద్ధాంతి**—ముమ్మాటికిని నమ్మకము గలదు. అట్లు జరుగనిచో నా చెవి తెగగోయించుకొందును.

**వనవీరుడు**—ఇంక మీరు వెళ్లవచ్చును. (వనవీరు డతనికి మొహారీలసంచి నిచ్చును. సిద్ధాంతి అది గ్రహించి కృతజ్ఞతా సూచకముగ నమస్కరించి వెడలును.)

**వనవీరుడు**—ధనమల్లూ! ఈయన చెప్పిన ఫలాలు ఎప్పుడైన దప్పిపోయినట్టు విన్నావా?

**ధనమల్లు**—లేదు. కాని అప్పుడప్పుడు ఈయనవాక్యములు సందిగ్ధార్థములు మాత్రము గలిగియుండును.

**వనవీరుడు**—దాని కాయన యేమి చేయగలడు. కాని యీ సందర్భములో మాత్రము సందిగ్ధార్థముల కవకాశము లేదు. ఈయన చెప్పినదానిని బట్టిచూడ, ఉదయసింహు డీయుద్ధములో దప్పక నోడిపోవుననియు, తరువాత నే యడవులలోనో చచ్చిపోవుననియు స్పష్టమగుట లేదా? అంతే కాకుండా నాకు ముప్పదియేండ్లలోపల, ప్రాణా పాయము లేదని చెప్పినాడు గదా? ఈగందరగోళము

లన్నియు నంతరించినతరువాత జాలకాలము నేను రాజ్యము చేయుదుననియే కదా దీని యర్థము. సరే ప్రస్తుతమునకు వత్తము. ఇదిగో ఈపత్రములో నున్న ప్రకారము దుర్గ సంరక్షణము గావింపుము. తరువాత నేను వచ్చి పరీక్షించెదను. (అని ధనమల్లున కొక కాగితము నిచ్చును. ధనమల్లు అది గ్రహించి చదివి చూచి చిత్తమని నమస్కరించి వెడలిపోవును.)

(తెర వ్రాలును.)

# మూడవ అంకము

## రెండవ రంగము.

[అయిదురోజులతరువాత నాగడిలోనే మధ్యాహ్నము 2-0 గంటల వేళ, వనవీరుడు నిరుత్సాహముతో గొన్నికాగితములు చదువుచుండును. ధనమల్లు ప్రవేశించును.]

**వనవీరుడు**__ధనమల్లూ! ఈ నాలుగైదురోజులలో స్థితిగతు లెంతగా మాఱిపోయినవి. మాలోజీని, సోలంకీని, అయిదు వేల ఉత్తమాశ్వికసైన్యముతో శత్రువులపై బంపిననాడు పరిస్థితులు చాల ననుకూలముగ గనుపడినవి. ఇంతలో విప్లవకారులసైన్యము, మనసైన్యమును నిర్మూలించినది. రాజభక్తియుతుడు, వీరాగ్రేసరుడు నయిన మాలోజీ వీర స్వర్గ మలంకరించినాడు. సోలంకి శత్రువులకు జిక్కి చిక్కుల పాలైనాడు. విజయోత్సాహముచె విఱ్ఱవీగుచున్న విప్లవ నాయకులు ఈ కోటను ముట్టడింప నుద్యుక్తు లగుచు న్నారు. మాలోజీ అంటే నాకు కుడిభుజమే. అతడు, మానవాకృతి దైకొనిన స్వామిభక్తి, మిత్రకులాలంకా రుడు, ఉపదేశిక చక్రవర్తి. ఆనా బహిఃప్రాణము, ఈభార మంతయు నాతలపై బడవైచి జగన్నాటకరంగమునుండి నిష్క్రమించినాడు. అయ్యో! దైవమా! ఎంతకు దెచ్చి తివి. కాని నేను నిరుత్సాహపరుడనైనటు లెవరికి దెలియ

నీయకుము. ధనమల్లూ! ఈపృథ్వీరాజాత్మజు డంత సులభ
ముగా లొంగువాడు గాడు.

**ధనమల్లు**—గ్రామస్థులకు విప్లవకారులమీాద ద్వేషము కలిగి
నదా?

**వనవీరుడు**—అదియును గలుగలేదు. పదివేల గుఱ్ఱపుదళ
మును సమకూర్ప ప్రయత్నించితిని. కాని ప్రతిపక్షులు,
నాకు సాయము చేసినవారిని జంపెదమనియు, వారిగ్రామ
ములు దోచి తగులబెట్టెదమనియు, ఆ అమాయికులయిన
ప్రజలను బెదరించిరి. సిగ్గుమాలినప్రజలు, విక్రమజిత్తు
గావించిన దౌర్జన్యములు, చిత్రశోభలు మఱచిపోయి,
ఉదయసింహుని బట్టాభిషిక్తుని గావింప నువ్విళ్లూరు
చున్నారు. 'పృథ్వీరాజపుత్రునకు సాయముచేయ మా
కభ్యంతరము లేదు కాని, సీతలసేనీకుమారుని పేరైన
దలంప మే మంగీకరింప' మని యొక దుండగీడు బిగ్గఱగా
నఱచినాడు వెంటనే ఆ దురాత్ముని తల దీయించితిని.
దానితో నంతకుబూర్వము మనపక్షమున జేరిన కొలదిమంది
కూడ నొక్కసారిగ వెడలి శత్రుపక్షమున గలిసిరి. అయి
నను మించిపోయినది లేదు ఈదుర్గము శత్రువుల కభే
ద్యము. ఇంకను మనము జయమొందుటకు దగినంత యవ
కాశము గలదు. అయితే కోటలోనున్న భోజనపదార్థము
లెంతకాలమునఱకు సరిపోవును?

**ధనమల్లు**—రెండుమాసములవఱకు సరిపోవును

**వనవీరుడు**—మంచిది ఇంక నాలునెలలకు సరిపోవు సామగ్రి
దెప్పింపుము. ఎంతడబ్బు ఖర్చైనను సరే వెనుదీయకుము.

ఇంక శత్రువులు మనకోటను సాధింపలేరు. నీ యభిప్రాయ మేమి ?

**ధనమల్లు**—ఔను సాధింపలేరు.

**వనవీరుడు**—సిద్ధాంతి గూడ నట్లే చెప్పినాడు. మాలోజీ సోలంకీలను యుద్ధమునకు బంపకపూర్వము వారివిషయమై నాదైవజ్ఞు నడుగకపోవుట పొఱపాటే. ముందుగ నెఱింగిన నీయాపద దప్పించుకొనెడివారమే.

**ధనమల్లు**—నేనది యంగీకరింప జాలను. జరుగవలసినది జరిగియే తీరును. మనకు దెలిసినను భవితవ్యమును దప్పింపనేరము. ఏమైనను దాము జెప్పిన ఫలితములు దప్పక జరుగునని కదా జోస్యులు చెప్పుచుందురు. రానున్న సంగతులను ముందుగా దెలిసికొనుట, తెలిసికొనకపోవుట గూడ మన భవితవ్యముమీదనే ఆధారపడి యుండును. ఆకారణముననే శ్రీవారు మాలోజీవిషయ మడుగుట తటస్థింపలేదు.

**వనవీరుడు**—అటులే అయియుండవచ్చును. కాని ముందుగా నెఱిగిన దైవగతిగూడ దప్పింపవచ్చుననియే నా యభిప్రాయము.

**ధనమల్లు**—జోస్యుని ఫలితములు తప్పింపగలిగినచో నాఫలితములయందు నమ్మక ముందుటెట్లు సంభవించును ?

**వనవీరుడు**—ఔను, నీవు చెప్పినదియు నిజమే! కాని అతడు చెప్పిన మూడుఫలితములు మనకు జాల ననుకూలములయినవే. అయినప్పటికి మనము కేవలము దైవమునే నమ్మి

యుండరాదు. నాకొక చక్కని యుపాయము స్ఫురించినది. (చీకాకుపడి, ఆకస్మికముగా) ఆఱునెలల క్రింద ఢిల్లీనుండి మనకొక యుత్తరము వచ్చినది జ్ఞాపక మున్నదా! మన మెప్పు డడిగిన నప్పుడు సహాయము చేసెదనని సుల్తాను వాగ్దానము చేసియున్నాడు గదా! వెంటనే సహాయము పంపుడని ఢిల్లీ కిప్పుడే వర్తమానము పంపుదము.

**ధనమల్లు**—(ఆశ్చర్యముతో) మ్లేచ్ఛులకేనా? మహాప్రభూ!

**వనవీడుడు**—ధనమల్లూ! 'ఆపత్కాలే నాస్తి మర్యాదా' అను న్యాయ మెఱుగవా? ఈ సామంతులసైన్యము నెదుర్కొనుటకు మనకు శక్తిచాలదు. కాని మహమ్మదీయుల సైన్యము, వారితుపాకులు, ఫిరంగులు, మనకు సాయమైనచో, కాణ్వాయుద్ధములోవలె, శత్రువులను దునుమాడ వచ్చును. ఎందుకు అలా నిర్ఘాంతపోయి చూచుచున్నావు? కర్ణావతి, హుమయూనును, అన్నయ్యా! అని సంబంధము కలుపుకొని సహాయము వేడలేదా? ఆప్రకారమే మనము విఘ్ననాయకుల నణచుటకై పర్షాసహాయ మపేక్షింతము. ఇటువంటి కష్టసమయములలో దప్ప దక్కినసమయములలో మతాంతరుల సాయము వేడుట నాకును సమ్మతము కాదు. ఇంతకు మహమ్మదీయులు మనదేశములో స్థిరనివాసము కల్పించుకొని పాదుకొని పోయినారు. హిందూదేశపు రాజు లన్నతరువాత, హిందువులైనను సరే, మహమ్మదీయులైనను సరే, పరస్పరము సహాయ మొనర్చుకొని విఘ్నములను రూపుమాపవలసినదే! ఇట్టి సహాయసంపదల

విషయములలో మతభేదము లడ్డుపడ రాదు. పూర్వము, అమరకోటయుద్ధములో హుమాయూను హిందూరాజుల శరణు వేడలేదా? ఇటుపై హిందూ ముసల్మానుమైత్రి సర్వజనాంగీకారము బడసి వృద్ధినొందగలదు. ఇందులో నీ యుద్దేశ మేమి?

**ధనమల్లు**—నే నీవిషయములగూర్చి అంతగా నాలోచింపలేదు.

**వనవీరుడు**—(చిరునవ్వు నవ్వి) నేనెఱుగుదును లే! వర్తమాన పరిస్థితులను గేలము విస్మరించి, మతాంతరులతో నెట్టి సంబంధము పెట్టుకొన నిచ్ఛగింపని పూర్వాచారపరాయణ కోటికి జెందినవాడవు నీవు. ఇక్లెంతకాలము, ఒంటికెట్టు రామలింగడవై యుండగలవు?

**ధనమల్లు**—నా జీవితాంతము వఱకైనా!

**వనవీరుడు**—ఛీ! అటుపిమ్మట నీకొడుకులు, మనుమలు,ముని మనుమలమాట ఏమి?

**ధనమల్లు**—వారిటప్పులు వారు పడగలరు. మన సమస్యలను మనము పరిష్కరింప గలిగినచో, వారిసమస్యలను బరిష్కరించినంతఫలము. రాబోవువారి సమస్యలనుగూడ బరిష్కరింప గల శక్తిసామర్థ్యములు మనకు లేవు. పెద్దలు చెప్పినటులు, ఏకాలమునకు సంబంధించిన సమస్యలను, ఆకాలమే పరిష్కరింపగలదు.

**వనవీరుడు**—జైనులకు సహజమయిన సూక్ష్మబుద్ధి నీకు గలదు. మా రాజపుత్రు లవసరమునుబట్టి ధర్మములు మార్చుకొన గలరు. ఇప్పుడు మనకు జయము గలుగవలయునన్న,

మనము దప్పక మహమ్మదీయుల సహాయము పొంద వలయును.

**ధనమల్లు**—అట్టి సహాయమును సుల్తాను మన కుచితముగా జేయడు. అతనికి లోబడి కప్పము గట్టెదమని యొప్పుకొని నచో నాత డంగీకరించునేమో! ఈపవిత్రమయిన మే వాడురాజ్యము మహమ్మదీయాధికారము నంగీకరింపవల సినదేనా?

**వనవీరుడు**— నామకః అంగీకరించినంతమాత్రమున నేమి ప్రమాదము వచ్చును? మనకు దగినబలము చేకూరిన వెంటనే దానిని విడనాడవచ్చును. (పెట్టెలోనుండి యొక యుత్తరము దీసి ధనమల్లున కిచ్చును.) ఇదిగో! ఉత్తరము సర్వసిద్ధముగ నున్నది. దీనిని వెంటనే నమ్మకమున్న భటున కిచ్చి పంపుము.

**ధనమల్లు**—చిత్తము.

**వనవీరుడు**—సమాధానము వచ్చుట కెంతకాలము పట్టును?

**ధనమల్లు**—సుమారు ఎనిమిదివారములు. మూడువారములు పోవుటకు, మూడువారములు తిరిగివచ్చుటకు, రెండు వారములు వా రాలోచించి సమాధానము చెప్పుటకు, బట్టును.

**వనవీరుడు**—అంతవఱకు మన మెట్లైనను సరే ఈ కోటను నిలుపుకొనవలయును. వెంటనే యెంతఖరీదైన నిచ్చి, ఆఱు మాసములకు వలయు సామగ్రిని దెప్పింపుము. అదృష్ట

వశమున ధనాగారము పరిపూర్ణముగ నున్నది. ఎంత వెచ్చించినను ఇబ్బంది యుండదు.

**ధనమల్లు**—ఈమధ్యాహ్న మిచ్చుటకు, పదివందలమంది వర్త కులువచ్చునటు లేర్పాటు గావించితిని.

**వనవీరుడు**—భేష్, భేష్, నీవత్యద్భుత ప్రతిభాశాలివి, ధన మల్లూ! కావలసిన యేర్పాటులన్నియు ముందుగనే కావిం పుము. ఈయుత్తరము శీఘ్రముగా బంపుము. సామగ్రి సమకూర్పుము రెండునెలలు గడచులోపల, పరిస్థితు లనుకూలముగా మాఱగలవు. ఏమందువు ?

**ధనమల్లు**—ఔను, మాఱక తప్పదు. (ఉత్తరము పుచ్చుకొని వెడలును.)

(తెర వ్రాలును.)

# మూడవ అంకము

## మూడవ రంగము.

[అగడిలోనే తరువాత మూడుగంటలకు వనవీరుడు కాగితములు తిరగవేయుచు కూర్చుండును. సేవకుడు సంభ్రమముతో ప్రవేశించును.]

**సేవకుడు**—మహాప్రభూ! శత్రువులు కోట పట్టుకున్నారు. కొందఱు సామంతులు ఈమందిరం వైపుకే వస్తున్నారు.

**వనవీరుడు**—ఛీ! విధవా! ఏమిటీ అల్లరి.

**సేవకుడు**—నిజం, మహాప్రభూ! నిజం. తమరు మనకు గర్భశత్రువులైన మహమ్మదీయుల సాయం కోరటంచేత, మండిపడిపోయి ధనమల్లుమంత్రిగారు, ఇంకా మఱికొందఱు దొరలు, వర్తకులవేషంలో ఉన్న పదివందలమంది రాజపుత్రసీపులను కోటలోకి ప్రవేశపెట్టారు. లోపలికి రాగానే వారంతా తమవేషాలు తీసి పారవేశారు. అప్పుడు వారిదగ్గర కావలసినన్ని ఆయుధాలు కనబడ్డాయి. వెంటనే వారు కోటగుమ్మాల్లో కాపలా కాస్తూన్నవాళ్లనందఱినీ అమాంతంగా నరికి పారేశారు. తరువాత కోటలోఉన్న మనసైన్యం, మీరు ముసల్మానులకు వ్రాసిన ఉత్తరం సంగతి విని, నొచ్చుకుని, శత్రువులలో కలిసిపోయింది. అట్లా కలిసినవారందఱికి, వారినౌకరీలు వారికి నిలిపి,

ఏమీ అపాయం రాకుండా కాపాడతామని సామంతులు మాట యిచ్చారు. ఈ రాజమందిరం కాపలా కాచేవారు మాత్రం నిజాయతీగా ఉన్నారు. లోపలికి వచ్చిన విరోధులు, కోటద్వారాలన్నీ తెరిచివేశారు. ఆ ద్వారాల గుండా శత్రుసైన్యమంతా ఏ అడ్డు లేకుండా లోపలికి విరుచుకు పడుతోంది. వెంటనే ఇక్కడికికూడా వస్తుంది. వారూ వీరూ అంతా కలిసి ఉదయసింహుని రాజుగా ప్రకటించారు.

**వనవీరుడు**—ఆద్రోహి ధనమల్లు ఎక్కడున్నాడు? ద్రోహం చేసినందుకు అతనిని ఎవరూ చంపలేదా?

**సేవకుడు**—చంపలేదు సరే గదా, చాలామంచిపని చేశాడని పొగడి అతన్నే మంత్రిగా అట్టిపెడదామని సామంతులనుచున్నారు.

**వనవీరుడు**—నామాట కెదురుచెప్పిన ఆదుర్మార్గున కుత్తరమిచ్చుట పొరపాటే అయినది. ముప్పదియేండ్లనుండి నమ్మకముగా పనిచేయుచున్నాడనే విశ్వాస ముంచినందుకు నాకు దగినశిక్ష జరిగినది. ఈ భవనద్వారాలన్నీ జాగ్రత్తగా రక్షించుచున్నారా?

**సేవకుడు**—చిత్తము మహాప్రభూ! నమ్మదగిన బంటులు నూట ఏభైమంది ఉన్నారు. వారు చావటానికైనా ఒప్పుకుంటారు గాని శత్రువులకు లొంగటానికి ఒప్పుకోరు.

**వనవీరుడు**—మంచిది. డబ్బు దాచినకొట్టు మందుంచినకొట్టు జాగ్రత్తగా కాపాడండి. ఇక్కడికి నమ్మకముగల సిపా

యీల నైదుగురిని బంపుము. (సేవకుడు వెడలిపోవును. ఆయుధపాణు లైదుగురు సిపాయీలు వచ్చి వనవీరుని చెంత నిలుతురు.)

వనవీరుడు——(నాయకునివంక చూచి) ధనాగారమును జాగ్రత్తగా రక్షించుచున్నారా ?

నాయకుడు——చిత్తము, మహాప్రభూ !

వనవీరుడు——మందుకొట్టు.

నాయకుడు——చిత్తము, మహాప్రభూ !

వనవీరుడు——మన సైనికులందఱు భక్తివిశ్వాసాలతో ఉన్నారా ?

నాయకుడు——ఆనూట ఏభైమంది ఏలినవారి సొంతసైనికులు. అందులో చాలామంది పెద్ద రాజాగారికింద యుద్ధం చేసిన వాళ్లకొడుకులే. వారిలో ఒక్కడైనా ద్రోహం తల పెట్టడు.

వనవీరుడు—— అదిగో ! రాయబారము పేరుపెట్టుకొని సామంతులిక్కడికి వచ్చుచున్నారు. వారు అమాంతంగా నామీద వచ్చి పడకముందు ద్వారము బంధింపుడు. (ద్వారము బంధింతురు. కాంజీ, కొఠారి, శోణఘురరావు వచ్చి తలుపు కొట్టుదురు.)

కాంజీ——వనవీరా ! తలుపు తీయుము.

వనవీరుడు——తీయుటకు వీలులేదు. మీరీమందిరాన్ని ముట్టడించినచో, ఈ రాజభవనము, సింహాసనము, ధనము,

ధాన్యము, మందుగొట్టు అదీ ఇదీ యేమిటి యిక్కడున్న వన్నీ యొక్కమాటుగా తగులబెట్టించెదను.

**కాంజీ**—ఇంకా నీకీ పిచ్చి యెందుకు? ఎంతకాలము పెనగులాడగలవు? మీాకా, భోజనసామగ్రి లేదు. ఉన్న పదార్థములు మూడునాలుగురోజులకన్న నెక్కువ రావు. నీవు పిచ్చిపిచ్చిగను లేమిా చేయక ఈభవనము, ధనాగారము, ఆయుధసామగ్రి సర్వము సమర్పించినచో, ఉదయసింహమహారాణావారు నిన్ను మన్నించి రక్షింతురు. తరువాత నిన్ను సకళత్రపుత్రమిత్రపరివారముగా తగిన సహాయ మిచ్చి నీ యిచ్చవచ్చినచోటికి బంపగలరు. ఆప్రకారముగా నీవు లోబడకపోయినచో నిన్ను నీవారి నందఱిని కత్తికోకకండగా జీల్చి కాకులకు గద్దలకు బారవేయ గలరు. వెఱ్ఱిధోరణిలోపడి నీకు, నీతండ్రికి, మాకు, తీరనికళంకము సంపాదింపకుము. నీవు మూర్ఛించినా, నీపరిజనులు, ప్రాణాలపై తీపిచే మాకు లోబడగలరు అప్పుడు నీవు ఱెక్కలుదీసిన పక్షివగుదువు. కావున దూరభారమాలోచించుకొనుము.

**నాయకుడు**—(వనవీరునితో) దేవా! ప్రత్యక్షముగా వంశనిర్మూలమునకు పూనుకోటం ఎందుకు? ఈపద్ధతుల కంగీకరింపుడు.

**వనవీరుడు**—(కాంజీ నుద్దేశించి) నాప్రాణములపై దీపిచే గాక, అమాయికులు నిష్కపటులు అయిన నా భార్యా

పుత్రాదులకొఱకు, ఈ విశ్వాసపాత్రులయిన పరిజనుల కొఱకు, చిత్తూరుదుర్గమునం దత్యంతాభిమానము చూపిన నాతండ్రి తాతల మనోరథగౌరవములను గాపాడుట కొఱకు, నీ చెప్పినపద్ధతుల కంగీకరించుచున్నాను. కాని నమ్మించి స్వామిద్రోహముచేయు మీవంటి పరమనీచుల మాటలయందు నాకు నమ్మకము లేదు. ఉదయసింహుఁడు స్వయముగా వచ్చి, ఏకలింగస్వామిసాక్షిగా ప్రమాణముచేసిన నంగీకరించెదను.

కాంజీ——నీ కారుకూతలవలన మాకు కలుగు లోటేమియు లేదు. సత్పురుషులు నీవంటి దుష్టసర్పమును విడనాడ వలసినదే. అయినప్పటికి, తరతరములనుండి రాజపుత్రవీరులచే నాశ్రయింపబడిన ఈదుర్గ సౌభాగ్యము కాపాడు నుద్దేశముతో, మహారాణావారిని బ్రార్థించి నీయభీష్టము నెఱవేరునటులు చూచెదము. దుర్గము స్వాధీనమయిన వెంటనే వైభవోపేతముగా బ్రవేశింప నిరీక్షించుచున్న మహారాణావారికి, ఈ శోణఘురరావుచే వర్తమానము పంపెదను. (శోణఘురరావు వెడలును.)

వనవీరుడు——యుద్ధము ముగియనంతరఱకు, మొగము చాటు చేయు చిత్తూరురాణాలలో ఉదయసింహుఁడే మొదటి వాఁడుగా నుండును గాబోలు. ఛీ! ఛీ! ఇటువంటి పిరికి పంద సంగరాణాపుత్రుడనియు, విశేషించి, వర్తమాన కాలమున మీకు రాణా అనియు జెప్పుకొనుటకు సిగ్గైన గలుగుటలేదా? ఈవీరాగ్రేసరచక్రవర్తి మహాత్ముదీయులు

దుర్గమును ముట్టడించునప్పుడుకూడ నిట్టిపౌరుషమునే చూపుదు గాబోలు.

కాంజీ— మహాత్మకీయ పాదోదకపాన మపేక్షించుచున్న నీవంటితుచ్ఛుడా, మా బాలమహారాణాను బరిహసింప వలసినవాడు. శైశవదశలో నున్న రాణాను జంపుటకు వెడలి, గాఢనిద్రలోనున్న అమరుని జంపిననాటి నీపౌరుషము, నీకమ్మన్యులైన నీ యనుచరులసాహసము, ఎవ్వ రెఱుంగనిది? నీ మహాత్మకీయసోదరులు నీకిప్పుడక్కరపడుదు రని భ్రమించుచుంటివి కాబోలు. వారికి నీవు వ్రాసిన దివ్య లేఖ, మాయొద్ద భద్రముగ నున్నది, వారికి జేరనే చేరదు. నీవు పోయి వారి కాళ్లమీదబడి బ్రతిమాలినను, నీపౌరుషము, నీగౌరవము ఇంతయుమున్నే వినియుండుట తుచ్ఛులు నీమాట నెంతగ మన్నింతురో చెప్ప నవసరము లేదు. అదిగో మహారాణావారు విజయము చేయు చున్నారు. (మహారాణా ధీర్ఘాయుష్మంతు డగుగాక జయ! ఉదయసింహమహారాణాకు జయ! అని కేకలు వేయు దురు. సామంతపరివేష్టితుడై ఉదయసింహుడు ప్రవేశించును. వెంట జనసమూహ మనుసరించును. ఆసంఘములో, పన్నా, జగ్గు, ఉందురు.)

శోణపురరావు—మహారాణావారు నాకు ద్రోవలోనే ఎదురు పడినారు

ఉదయసింహుడు—వనవీరా! మహాపురుషుడు కాంజీ గావించిన సంధినియమములకు మేము బద్ధులమై యుందుము. చిత్తూరు

దుర్గమును, రాజప్రాసాదమును, ధనాగారాదులను, చెక్కు చెదరకుండ మా కర్పించెదవేని, నిన్ను నీవారినందఱిని క్షమించి రక్షించెదము, తగినసాయ మొసంగి, నీగమ్య స్థానము చేరు నవకాశము గల్పించెదము—అని ఏకలింగ స్వామిసాక్షిగా వాగ్దానము చేయుచున్నాము.

వనవీరుడు—సరే అట్లులైనచో నేను దుర్గమును స్వాధీనము గావించెదను. (తలుపు తెఱచును, ఉదయసింహుడు, సామంతులు, తదితరులు ప్రవేశింతురు. వారిలో సిద్ధాంతి గూడ నుండును)

వనవీరుడు—(వారితో బ్రవేశించిన సిద్ధాంతిని జూచి) ఓరీ! పరమనీచుడా! అన్నీ తప్పుడుఫలితములు చెప్పితి వేమిరా?

సిద్ధాంతి—ఓ పెద్దన్నయ్యా! నేనుచెప్పిన ఫలితములన్నియు సరిగా సరిపోయినవి. పాపము, నీవు సరిగా నర్థము చేసి కొనలేక పోతివి. విప్లవకారులు బల ముపయోగించి కోటను, స్వాధీనము చేసికొనలేదు రాజభక్తియుతులైన సామంతులు కోటను రాణావారికి స్వాధీనము గావించిరి. దయార్ద్రహృదయులైన మామహారాణావారు కాపాడిన, నీ తుచ్ఛప్రాణములకు ఇంక ముప్పదియేండ్లవఱకు వచ్చు ఇబ్బంది యేమియు లేదు. (కాంజీ కిరీటము గొని వచ్చి ఉదయసింహుని శిరమున నుంచును. ప్రజలందఱు జయ్ ఉదయసింహమహారాణాకు జయ్ అని కేకలు వేయుదురు. పన్నా ఉదయసింహునికి నమస్కరించును.) వన వీరుడు మెల్లగా నిష్క్రమించును

**పన్నా**—మహాప్రభూ! నావ్రతము, నా అమరుని ఆత్మ యజ్ఞము ఈనాడు సఫలమయినవి.

**ఉదయసింహుడు**— పన్నా! కుంభరాణావారివంశమును నిలువబెట్టి నీ వగణ్యమయిన పుణ్యము గట్టుకొంటివి. నీ ఋణము మేము దీర్చుకొనలేము. కృతజ్ఞతాసూచకముగ, నీవు జీవించియుండునంతకాలము సంవత్సరమునకు నూరు మొహారీలచొప్పున సంస్థానద్రవ్యమునుండి యిప్పించెదము. జగ్గూ! నీవు, పన్నా గలిసి మహారాణాలవంశమునకు గావించినమేలు మేము మఱువజాలము. నీకేడాదికి ఏబది మొహారీలప్రాప్తిని నీ యావజ్జీవము నిప్పించెదము. (పన్నా, జగ్గు, ఉదయసింహుని నమస్కరించి జయ్ ఉదయసింహ మహారాణాకు జయ్. అని కేకలు వేయుచుండ ఉదయసింహుడు, సామంతులు, తదితరులు వెడలిపోవుదురు. పన్నా, జగ్గు, సిద్ధాంతి మాత్రము నిలిచియుందురు.)

**జగ్గు**—(సిద్ధాంతితో) ఏం బాబూ! రెండుసంగతులే సెలవిచ్చారు. ఉదయసింహమహారాణావారు రాజ్యం పోగొట్టుకుని చాలాకాలం ఊరూ పేరూ లేకుండా జీవిస్తారని సెలవిచ్చారట. ఆ సంగతేమిటో మళ్లీ తెలిసేటట్టుగా నిజం చెప్పండి బాబూ!

**సిద్ధాంతి**—(నవ్వుచు) ఎవరికీ ఈసంగతి చెప్పమని ఒట్టుపెట్టుకుంటే చెప్పెదను.

జగ్గు; పన్నా—అయ్యవారు సెలవిచ్చినట్టుగా ఎవరికీ చెప్పము.

సిద్ధాంతి—ఎవరికీ చెప్పరుగదా? ......ఈ విషయముగుఱించి మఱల బాగుగా విచారించినాను. ఎంతసేపు ఆలోచించినా, రాణావారి కాదుర్దశ తప్పదనే తోచింది. భగవంతుడే ఆప్రకారము సంకల్పించిన మన మేమి చేయగలము. అంతే కాదు, ఇంకా ఇంకా ప్రమాదాలు జరిగేటట్టు కనుపడు చున్నవి.

జగ్గు—బాబూ! ఏమిటివి, బాబూ!

సిద్ధాంతి—(గజగజ వణకిపోవుచు) నన్నడుగవలదు. నే నాసంగతి చెప్పలేను.

జగ్గు—ఏమీ భయంలేదు చెప్పండి. అయ్యవారు కాకపోతే మాకు ఎవరు చెపుతారు ఈసంగతులు.

సిద్ధాంతి—ఈఒక్కమాటైనా నాఫలితాలు తప్పిపోతే సంతో షింతును.

జగ్గు; పన్నా—బాబూ! చెప్పండి బాబూ! మాకు చాలా భయం వేస్తోంది.

సిద్ధాంతి—ఎవరితోను జెప్పమని పెద్ద యొట్టుపెట్టుకొనుడు.

జగ్గు; పన్నా—ఆలాగే మీరు ఏఒట్టు పెట్టుకోమంటే ఆఒట్టు పెట్టుకుంటాము.

సిద్ధాంతి—'శత్రువులు చిత్తూరుదుర్గమును ముట్టడించి, దోచి, తగులబెట్టుదురు. అప్పుడు చిత్తూరు కాపాడటానికి మహా

రాణావారు కోటలో నుండరు. ఆకాలములో ఉదయ సింహమహారాణావారు అడవిలో ఒక కోయపల్లెలో తల దాచుకొని యుందురు. చిత్తూరుదుర్గము, మఱల నిర్మింప బడదు. ఈ దేవాలయము పాడుపడిపోవును.' అని నాకు గోచరించుచున్నది. ఇంక నేను వెడలిపోయి, ఈఆపత్తు తొలగింపుమని భగవంతుని ప్రార్థించెదను. మీరు మాత్ర మీసంగతి ఎవరికీ చెప్పవద్దు.

(అని నిష్క్రమించును.)

జగ్గు—పన్నా! ఈ అయ్యవారు చెప్పింది నిజం అవుతుందా?

పన్నా—ఏమో నాకు మాత్రం చాలా దుఃఖం వస్తోంది. అయినా ఏనాడో జరిగేదానికి ఇప్పటినుంచీ విచారపడటం ఎందుకు?

జగ్గు—మళ్లీ కోటను పట్టుకోటమే జరిగితే, ఈ చిన్నరాణా అంతపనీ చేస్తాడు. వనవీరుడు అన్నట్టుగా ఈచిన్న రాణాకు ధైర్యం లేనేలేదు. ఆజైను బాబయ్య ఇంట్లో ఉండటం బట్టి ఇంత పిరికివాడైపోయాడని మనవారు లనుకుంటు న్నారు. కాని ఈయన చిన్నప్పటినించీ ఇంతే. ఇంకా పెరిగి పెద్దవాడైనా, ఈ పిరికితనం ఈయనకు ఈలా ఉండేదే. ఎందుకూ పనికిరాని ఈయన్ని బతికించటానికి నీ అమ్మాయిన్నే ఎందుకు చంపుకున్నావు?

పన్నా—జగ్గూ! నీవు పొరపాటు పడుతున్నావు. ఈయన్ని బతికించామంటే, బప్పరావులు, కుంభరాణా, సంగమహా రాణాలవంశము నశించకుండా నిలబెట్టామన్నమాట. అసలు పొలం అనేది ఉంటే, ఒక ఏడాదిపండినా పండక పోయినా, ఆవారడీ ఈవారడీ రెండో ఏడు బాగా పండుతుంది ఈపిరికిపంద అయిన ఉదయసింహునివంశంలో ఎంతెంత గొప్పవారలు [1]పుట్టాలని ఉన్నారో ఎవరెఱుగున్నారు. నేనీ ఆశతోనే ఉంటాను. మొదటితరంలో కాకపోయినా, తరువాత తరంలో అయినా, నాకోరిక తప్పకుండా నెరవేరుతుందని నాకు గట్టినమ్మకం ఉంది. అప్పుడప్పుడు, ఎవళ్లైనా ఒకళ్లిద్దరు తప్పబుట్టినా, కులాన్ని మాత్రం తప్పకుండా నిలబెట్టాలిసిందే! ఎన్నిపాట్లైనాపడి కులాన్ని నిలబెడితే, లాభము గలుగుతుంది, పుణ్యమూ గలుగుతుంది.

(తెర వ్రాలును)

రత్నప్రభ నాటకము సర్వము సంపూర్ణము

శ్రీ శ్రీ. శ్రీ. శ్రీ

1. ఈ ఉదయసింహునికుమారుడే యీరాజకుటుంబమున మహా శూరుడని కీర్తిగాంచిన మహారాణా ప్రతాపసింహుడని యెఱుంగదగు. స్వాతంత్ర్యస్థాపనమునకై యీతడు అక్బరుతో గావించిన మహాయుద్ధము చాల ప్రసిద్ధికెక్కినది.

# వచనగ్రంథములు.

---

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| శ్రీగురజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు ... | 3 | 8 |
| శ్రీజగన్నాథమాహాత్మ్యము ... | 0 | 2 |
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశస్కంధములు, 3 సంపుటములు | 7 | 0 |
| డిటో ఒకటేసంపుటము ... | 6 | 8 |
| ఆంధ్రవచనభారతము, ఆదిసభాపర్వములు ... | 2 | 8 |
| ,, ఆరణ్యపర్వము ... | 2 | 8 |
| ,, విరాటోద్యోగపర్వములు ... | 2 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు ... | 4 | 0 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు ... | 2 | 8 |
| ,, శాంతిపర్వము ... | 4 | 0 |
| ,, ఆనుశాసనిక మొదలు స్వర్గారోహణపర్వములు గల సంపుటము ... | 4 | 0 |
| పూర్తిసెట్టు నొకేమారు కొన్నవారికి ... | 20 | 0 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము, 2 సంపుటములు ... | 12 | 0 |
| యజుర్వేదకథాసంగ్రహము ... | 0 | 8 |
| శ్రీవివేకానందవిజయము ... | 1 | 12 |
| భారతరమణీమణులు, ప్రథమభాగము ... | 0 | 12 |
| డిటో రెండవభాగము ... | 0 | 8 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శ్రీమహాభక్తవిజయము, నూతనముద్రితము | ... | 6 | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరిగారిది | ... | 0 | 6 |
| పంచతంత్రము, వచనము, సులభశైలి | ... | 0 | 6 |
| హితోపదేశము, సులభశైలి | ... | 0 | 12 |
| నవనాథభక్తులచరిత్రము | ... | 2 | 0 |
| సంగ్రహరామాయణము | ... | 0 | 10 |
| సంగ్రహభారతము | ... | 1 | 0 |
| సంగ్రహభాగవతము | ... | 1 | 0 |
| ప్రాచీనదేశచరిత్రలు | ... | 1 | 12 |
| పతివ్రతలచరిత్రలు | ... | 1 | 8 |
| దక్కనుపూర్వకథలు | ... | 1 | 8 |
| భోజునికథలు | ... | 0 | 8 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | ... | 0 | 4 |
| సంస్కృతనాటకకథలు | ... | 1 | 4 |
| దశకుమారచరిత్రము, సంజీవరాయశాస్త్రి | ... | 1 | 8 |
| మదనకామరాజుకథలు, చక్కనికూర్పు | ... | 0 | 14 |
| దేశింగురాజుకథ, జంగంకథ | ... | 0 | 6 |
| విక్రమార్కునికథలు | ... | 0 | 8 |
| చార్‌దర్వేషుకథలు | ... | 0 | 8 |
| తాతాచార్యులకథలు | ... | 0 | 6 |
| భేతాళకథలు | ... | 0 | 8 |
| వైద్యులకథలు | ... | 0 | 4 |
| వీరాంగనలు | ... | 0 | 12 |
| పరమానందశిష్యులకథలు | ... | 0 | 3 |
| నలుగురుమంత్రులకథలు | ... | 0 | 4 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | ప్రతి 1-కి | రూ. | అ. |
| అయిదుగురుదొంగలకథలు | ... | 0 | 6 |
| స్వామిరామతీర్థ జీవితము | ... | 0 | 2 |
| శ్రీరామానుజాచార్యచరిత్ర | ... | 0 | 2 |
| శాలివాహనచరిత్ర | ... | 0 | 3 |
| శ్రీలాలాలజ్ పతిరాయిజీవితము | ... | 0 | 2 |
| రామకృష్ణపరమహంసచరిత్రము, ప్రతిమతో | ... | 0 | 3 |
| బాలగంగాధరతిలకుచరిత్రము ,, | ... | 0 | 4 |
| శ్రీగోపాలకృష్ణగోక్లేజీవితము ,, | ... | 0 | 2 |
| శ్రీమహాదేవగోవిందరానడేజీవితము ,, | ... | 0 | 2 |
| శివాజీచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 8 |
| బుద్ధచరిత్రము ,, | ... | 0 | 4 |
| శ్రీశంకరాచార్యచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 3 |
| శ్రీవేమనయోగిజీవితము ,, | ... | 0 | 2 |
| దాదాభాయినౌరోజీచరిత్ర ,, | ... | 0 | 2 |
| గౌరాంగస్వామిచైతన్యజీవితము | ... | 0 | 4 |
| శ్రీకరంచంద్ గాంధీజీవితము ,, | ... | 0 | 4 |
| నెపోలియన్ చక్రవర్తిచరిత్రము,, | ... | 0 | 4 |
| సోదరినివేదితజీవితము ,, | .. | 0 | 2 |
| శ్రీగైక్వాడుగారిజీవితము ,, | ... | 0 | 2 |
| వివేకానందస్వామిజీవితము ,, | ... | 0 | 2 |
| శ్రీకృష్ణదేవరాయచరిత్ర ,, | ... | 0 | 3 |
| అనిబిసెంటుచరిత్ర ,, | ... | 0 | 4 |
| శ్రీతుకారామస్వామిచరిత్రము | ... | 0 | 4 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| శ్రీసమర్థ రామదాసస్వామిచరిత్ర | ... | 0 | 4 |
| లార్డు క్లైవుజీవితము, ప్రతిమతో | ... | 0 | 8 |
| శ్రీ చిత్తరంజనదాసుజీవితము ,, | ... | 0 | 4 |
| అలీసోదరులజీవితము ,, | ... | 0 | 4 |
| మైరావణచరిత్ర, చక్కనికూర్పు | ... | 0 | 1 |
| పండిత మదనమోహనమాళవ్యాజీవితము | ... | 0 | 2 |
| అనంతసాగరము, బుక్కరాయసముద్రచరిత్ర | ... | 0 | 12 |
| రామదాసుచరిత్ర, ప్రతిమతో | ... | 0 | 12 |
| రేచుక్కపగటిచుక్కకథలు | ... | 0 | 3 |
| సీతారామము | ... | 1 | 4 |
| ఐవన్హో, నవల | ... | 0 | 8 |
| మదాలస | ... | 0 | 10 |
| సుజనరంజని | ... | 0 | 8 |
| విజ్జలదేవి, నవల | ... | 1 | 4 |
| ఉన్మాదిని ,, | ... | 0 | 4 |
| రాధారాణి ,, | ... | 0 | 4 |
| అస్తమయము,, | ... | 1 | 8 |
| సత్యసేనవిజయము | ... | 0 | 4 |
| దుర్గేశనందిని | ... | 0 | 8 |
| కపాలకుండల | ... | 0 | 12 |
| లక్షణ, నవల | ... | 0 | 10 |
| శుకసప్తతికథలు | ... | 0 | 6 |
| టిప్పుసుల్తాన్, నవల | ... | 1 | 4 |
| లీల ,, | ... | 0 | 4 |

| | ప్రతి 1-కి | రూ. | అ |
|---|---|---|---|
| రాజర్షి నవల | ... | 0 | 14 |
| తారాబాయి ,, | ... | 0 | 12 |
| దిలారామ ,, | ... | 1 | 4 |
| సాంఘికదౌర్జన్యం | ... | 0 | 14 |
| ఆనందమఠ, నవల | ... | 0 | 12 |
| మనోహారి, నవల | ... | 0 | 14 |
| వీరబాల ,, | ... | 0 | 8 |
| లాలాబాయి | ... | 0 | 8 |
| ఆంధ్రగార్హస్థ్య నవల | ... | 0 | 14 |
| హేమలత | ... | 0 | 12 |
| ఈసబునీతికథలు 1-వ భాగము | ... | 0 | 6 |
| డిటో 2-వ భాగము | ... | 0 | 8 |
| పరిహాస్యవినోదకథలు | ... | 0 | 12 |
| మర్యాదరామన్నకథలు | ... | 0 | 2 |
| షేక్స్పియర్ నాటకకథలు | ... | 1 | 8 |
| రోషనార, చరిత్రవిషయికమగు నవల | ... | 0 | 12 |
| బాలాదిత్య (చరిత్రాత్మకమగు నవల) | ... | 2 | 0 |
| దేశభక్తుండు | ... | 1 | 4 |
| శంభూలో నొకనాటి సహవాసము | ... | 0 | 5 |



ఇంకను అనేక సంస్కృతాంధ్రగ్రంథములు వానిళ్ల వాచకములు, నిఘంటువులు, నాగరిలిపిగ్రంథములు మాయొద్ద దొరకును.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.